గౌరవ సంపాదకులు :

శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి

శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి

గౌరవ సహాయ సంపాదకుడు :

శ్రీ జనమంచి కామేశ్వర రావు

సంపాదకుడు :

శ్రీ బాలాంత్రపు సత్యనారాయణ రావు

# కావ్య కుసుమావళి

## శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

ద్వితీయ సంపుటి

ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్

రాజమహేంద్రవరము

# అనుక్రమణిక

## ప్రథమభాగము

## ద్వితీయభాగము

## తృతీయభాగము

# రెండు మాటలు

1924 సంవత్సరములో 'కావ్యకుసుమావళి' రెండు భాగములుగా ప్రచురింపబడినది. అనాటికి శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు రచించిన ఖండకావ్యములు 108 మాత్రమే యుండుగలవు. ఈరెండు సంపుటములలో నవియే కాక నేటివఱకును ఈకవిద్వయము రచించిన ఖండకృతు లన్నియు చేర్చితిమి.

వీలగునంతవఱకు రచనాకాలక్రమము ననుసరించి వరుసగా కాయాకృతులను ముద్రించితిమి. వీరి నాటకము లన్నియు ఇందు భాగాంతము లందు పొందుపఱచినాము. కథనకావ్యము లన్నియు నొకచో సేకరించినాము. భక్తిరసపూరితము లగుకృతుల నన్నిటిని తుదిని ఒకచో చేర్చితిమి. అందు 'భావసంకీర్తనము' అను పద్యావళి వీరి క్రొత్త కానుక.

ఈమహాకవుల షష్టిపూర్తిసమాప్తిన సమయమున ఈ 'కావ్యకుసుమావళి' ప్రకటింప మాకు సర్వవిధముల తోడ్పడిన మిత్రు లందఱకు మాకృతజ్ఞతాపూర్వక వందనములు.

బాలాంత్రపు సత్యనారాయణ రావు
సంపాదకుడు.

# కావ్యకుసుమావళి

## ప్రథమ భాగము

### ప్రార్థనము

అనుభవవేద్యమై, ప్రణయ
హాసనముజ్జ్వలమై, జగజ్జనా
వసమయి, శోభనంబగు భ
వత్సుకుమారమనోజ్ఞమూర్తి మా
కనుఁగవనిల్పి, భక్తజన
కల్పక! కృష్ణ! త్వదీయలోకమో
హనమురళీరవామృతర
సాయన మా ముఖిలీఁ గూర్చవే!

*　　　*

గొల్లవడంతులుఁ, బసులు,
గోవులు నేమురళీస్వనంబులఁ
బల్లవితాత్ములై యచల
భక్తిరసైక్యముఁ గాంచి, తొల్లి నీ
చల్లని వ్రేలిజాగొడుగు
చక్కటిఁ జేరి సుఖింపఁగల్గిరో
నల్లని సామి! యామురళి
నాదము మాకు ననుగ్రహింపవే!

# తెలుఁగుతల్లి

తెలుఁగు మాటల పంచదారల
తీపు గాంచిన తెలుఁగుతల్లీ!
తెలుఁగు పాటల తేనెతేటల
సొనల నించిన తెలుఁగుతల్లీ!
తెలుఁగు బాఁపల తెలుఁగు రాజుల
తెలివిఁ దిద్దిన తెలుఁగుతల్లీ!
తెలుఁగు బీరుల తెలుఁగు కాఁపుల
కలిమిఁ గూర్చిన తెలుఁగుతల్లీ!
తెలుఁగు బిడ్డల నెల్లపనులను
దిద్ది తీర్చిన తెలుఁగుతల్లీ!
తెలుఁగు తేజము దిక్కుదిక్కుల
నిలుప నేర్చిన తెలుఁగుతల్లీ!
«దేశభాషలఁ దెలుఁగు లెస్స»ను
తీర్పుఁ గాంచిన తెలుఁగుతల్లీ!
దేశదేశములందు ప్రాభవ
దీప్తిఁ జూపిన తెలుఁగుతల్లీ!
కమ్మదొరలకు ఘనపదమ్ములు
కాన్కఁ జేసిన తెలుఁగుతల్లీ!
వెలమదొరలకు విక్రమంబులు
విందు చేసిన తెలుఁగుతల్లీ!

క్షేత్రాల పాలనాలన
పేరు కెత్తిన తెలుఁగుతల్లి!
పంటకాఁపుల ప్రాభవంబున
భాగ్య మందిన తెలుఁగుతల్లీ!
పావనములగు జీవనదులకుఁ
దావు లొసఁగిన తెలుఁగుతల్లీ!
పంటపొలములఁ బాఁడిపశువులఁ
బ్రబల్లి యుండెడి తెలుఁగుతల్లీ!
మేటికవులకుఁ బోటుమగలకుఁ
గోట లిచ్చిన తెలుఁగుతల్లీ!
మూఁడు కొండల కోట లోపల
మూర్తి గాంచిన తెలుఁగుతల్లీ!
పుణ్యసతులకు భక్తవరులకుఁ
బుట్టినిల్లగు తెలుఁగుతల్లీ!
ఎందు చూచినఁ దోఁచు నీకిదె
వందనము మా తెలుఁగుతల్లీ!

## వెన్నెల పాట

కొండకోనలఁ గావిపూవుల
కోవగట్టిన లేఁతవెన్నెల
తలిరుగొమ్మల చిగురుపైఁటలఁ
దళుకు లద్దిన పూఁతవెన్నెల
చందమామను గోరి తెచ్చెదమా—
చెంగావికోరల
శారదాసతి కారతిచ్చెదమా!
కడలితరఁగల నురుగుముసుఁగులఁ
గఱకఁదేర్చిన తళుకువెన్నెల
పువ్వుఁగొమ్మల పులకరింతల
నవ్వులాడిన కులుకువెన్నెల
చందమామను గోరి తెచ్చెదమా—
చెంగావికోరల
శారదాసతి కారతిచ్చెదమా!
ఎల్లతావులఁ బాలగుమ్మలఁ
జిల్లులాడిన నిండువెన్నెల
మిన్నుమన్నులఁ దన్నివన్నెల
మేడ గట్టిన పండువెన్నెల
చందమామను గోరి తెచ్చెదమా—

సంగానికోలల
శారదానతి శారదత్వానమా!
కన్నెలుంగని తన్నెలుంగని
కలువకన్నెల వలపుపాటల
మీఁదెలుంగని వాడెలుంగని
మెఱుఁగుఁ జుక్కల తొలపుపాటల
చందమామను జేరి వేఁడుదమా—
బంగారుమురళిని
శారదానతిఁ గోరి పాడుదమా!
సిగ్గెలుంగని యెగ్గెలుంగని
చిన్ని పువ్వుల తేనెపాటల
విసువెలుంగని విసువెలుంగని
విన్నువాఁకల తేటపాటల
చందమామను జేరి వేఁడుదమా—
బంగారుమురళిని
శారదానతిఁ గోరి పాడుదమా!
తెరువెలుంగని బరువెలుంగని
తెల్లమబ్బుల లాలిపాటల
నెఱసెలుంగని నెమరెలుంగని
నెలపులుంగుల జోలపాటల
చందమామను జేరి వేఁడుదమా—
బంగారుమురళిని
శారదానతిఁ గోరి పాడుదమా!

# బంగారుపూలు

పొందుగా నొకనాఁడు పుట్టిన ట్లుండి
విస్మృతయుగలీల వెలువరించినది
ఎలమిలో నేఁబదేం డ్లడిగినట్లుండి
బహుయుగంబుల వయఃపటిమ గాంచినది
ఏఁటేట నొక బిడ్డ నెత్తినట్లుండి
కమపేదు బిడ్డలఁ గాంచి పెంచినది
తల్లిదండ్రులతల్లి తనయులతల్లి
యఖిలభారతజాతి నలరించుతల్లి
కలధాత్రి యాతల్లి పాదపూజలకు
భక్తితోఁ దేరమ్మ! బంగారుపూలు!
తలలోఁకభేదాల తలతిక్కలెల్ల
సమబుద్ధి శోధించి పడఁద్రోసినది,
కొలఁదిగొప్పతనాల కొఱకొఱలెల్ల
సమదృష్టిఁ జూపించి సమయఁ జేసినది,
కలిడియెడవంకల కొట్లాట లెల్ల
చదుమనె వారించి నాంది వ్రేసినది
కోటికన్నుల కొక్కగంటి చూపుదేవి
కోటికోటుల కొక్కగొడుగైన దేవి
ప్రణుతాత్మ యాదేవి పాదపూజలకు
భక్తితోఁ దేరమ్మ! బంగారుపూలు!

మూఁగకోరికలను మూర్తులఁ గూర్చి
మూలమంత్రములతో మూఁదలించినది,
మోమ్ముగన్నుల మత్తుముసుఁగులువీసి
విజ్ఞానసీమల వెలయఁ జేసినది,
భావదౌర్బల్యవిభ్రాంతిఁ బోకార్చి
యాత్మగౌరవవివేకాప్తిఁ గూర్చినది,
సుమహితేచ్ఛాశక్తి సుజ్ఞానశక్తి
సర్వార్థసంపన్న సత్క్రియాశక్తి
ఒహాలుమూర్తి యాశక్తిపాదపూజలకు
భక్తితోఁ దేరమ్మ! బంగారుపూలు!

---

## ఏ కాం త సే వ

పసరుమొగ్గకు గంధ పరిపాక మబ్బెఁ
బూవసిందెకు ఫలాభోగంబు గలిగె
సలుసంత కంటిలో నావంటి గోల
నిత్య సుందరమూర్తి నినుఁ జూడఁ గలిగె.

చెట్టును గింజలోఁ జేర్చిన చేయి
నా చేతులనుబట్టి నడపించు చుండ
బొగ్గులో రత్నంబుఁ బొదిఁగిన మూర్తి
నా మూర్తిలోనుండి నడయాడు చుండ

సమవృతో బ్రహ్మాండ మహనీయ శక్తి
నా శక్తిలోనిండి నలువొందు చుండ
నేనేమి యెఱుఁగక యిన్నాళ్ళు దాఁక
విశ్వమంతట నిన్ను వెదకులాడితిని
నెల చెంతనుండి వెన్నెల చెంతనుండి
యుష్ణాతపంబులో నుడికి పోయితిని
చలువ పందిటనుండి స్వామితో నుండి
విరహానలంబులో వేగి పోయితిని
ఆనందమును దుఃఖ మనుభవించుటకు
నా నాథ! యీ భ్రాంతి నా కేలగలిగె?

పరిమళ రజముతోఁ బ్రసవ రసంబు
గ్రీష్మాతపంబులోఁ గెరలుటఁ జూచి
ప్రణయరాగంబుతో భ్రమరసంగీత
మశని ఘోషంబులో నడఁగుటఁ జూచి
జీవధనంబుతోఁ జిన్నారి నౌక
మున్నీటి తరఁగలో మునఁగుటఁ జూచి
చివురాకుతోడి సంజీవనీలతిక
దావానలంబులోఁ దగులుటఁ జూచి
విమల తేజంబుతో వెన్నెల రేక
చీఁకటి మునుఁగులోఁ జిక్కుటఁ జూచి

తలపోసి తలపోసి తత్త్వ మూహించి
భౌతికసౌఖ్యవిభ్రాంతులు డించి
నా మనోనాథ! నీ నామామృతంబు
సేవించుకొనుటకె నే జీవించి యుంటి.

3

ఈ పల్వలంబింకి యీనాఁటికైన
నీలమేఘంబుతో నింగి నల్లాడి
తపియించి, మధురామృతస్వరూపమున
నమృతాబ్ధిఁ జేరిన దంతియే చాలు
కరుణాంబువులతోడి కన్నీటి చినుకు
లిరిగొండ చరియల నింకిన చోట
నానంద వల్లిక లలరిన నేమి
హాలాహలజ్వాల లడరిన నేమి
నానాథ! నీమూర్తి నా కన్నులందె
యంకితంబై యుండె నంతియే చాలు

# సుందరప్రకృతి

మవ్వంపు మొలకలు మలకలఁ బడఁ గాక
తలిరుటాకులు వన్నె దఱుఁగఁ గాక!
అందంపు నునుమొగ్గ లావులించును గాక
పూవుగుత్తులు తెల్లపోవుఁ గాక!
కమ్మని తెమ్మెరల్ కడకోసరిలుఁ గాక
యామని మార్మోగంబగున్ను గాక!
ఒప్పులొల్కెడి చుక్క లొక్కలాగగుఁ గాక
పున్నమనెల చిన్నబోవుఁ గాక!

ఏది యెట్టులైన నెప్పటి కప్పుడే
వింత చక్కఁదనము, వింత హాయలు
వింత చవులు వెలయ విలసిల్లు ప్రకృతి క
వంధ్యమధురగతికి వందనములు!

## శారదన ప్రకృతి

పలుచని మబ్బు మేనం బాలకళలుబ్బి నెల
పడుగుబ్బులుం గంప మడుగు వేళ,
నిండువెన్నెల చీర నిగ్గుదేలెడు వేళ
బెళుకుండ దెర జీమువాలు వేళ!
గటిక చీకటికొప్పు కాఱుగ్రమ్మెడు వేగ
వేగునందులం దెల్విరియు వేళ,
గడకారు నెమ్మేను కళలుమాసెడు వేళ
దొలికారు విరిసన్న లొలుకు వేళ,

సరిగ నేవేళ కావేళ నవనమధుర
సతతనూతనగతి చమత్కృతులు చూపి
నవనవారంభ తాండవానందపార
వశ్యమునం దేలు ప్రకృతికి వందనములు.

---

# తృ ణీ కా ర ము

శ్రీరాముని దేవేరిన్
వీరవనిత, లోకమాత, వెఱవక చెనకం
గోరి రఘువీరశరదు
ర్వారాగ్ని న్నగ్గనేల రావణతృణమా!
మణిహేమప్రభలన్ వెలార్పఁగల సా
మర్థ్యంబు నీ కబ్బినన్
మణులే నిన్ను వరించి మించఁగల సా
మ్రాజ్యంబు చేకూరిన
న్మణికి న్నీకును గల్గు హాస్తిమశ
కాంతంబైన పార్థక్యమున్
తృణమా! యెవ్వ రెఱుంగ రిట్టియెడ నీ
ధృష్టత్వ మీ కేటికిన్.
నిను నీయంతటి జీవిగా నెఱిఁగి నీ
నిత్యప్రమోదైక జీ
వనము న్నిత్యరసాస్పదంబుగ నొన
ర్పం జూచుకొమ్మా! తృణం
బను మాటం దలపోయ కీపగిది మోహ
భ్రాంతిచేఁ బచ్చ ప
చ్చని సంసారము పాడు సేసికొను దు
స్సంకల్పముల్ చెల్లునే?

తుంచివైచిన నైన గొప్ప నొప్పక యుండఁ
గలుగఁ గ్రమ్మఁగఁ జాలు కలిమి యున్న
ముంచివైచిన నైన ముప్పు నొప్పక యుండఁ
దలయెత్తికొనఁ జాలు బలిమి యున్నఁ
జిదిమివైచిన నైనఁ జెలువు గందక యుండఁ
జిగురు వెట్టఁగఁ జాలు చేవ యున్నఁ
పెఱికివైచిన నైన వరుగువాఱక యుండఁ
గాలు నిల్పఁగఁ జాలు కడక యున్న
నసిగలిగి యున్నఁ, బసిమించు మిసిమి యున్న
వసుమతీధారణమునఁ బెంపెసఁగి యున్న
నవనతిం గాంచు తృణమవే యవుదు గాని
యూ సమున్నత మేరు వెట్లవుదు వీవు?
కలికి చేసిన వాఁడి కత్తుల కొడవంటి
తలకోఁతఁ బడకుండ దాఁగఁ గలవె?
పదను చేసిన గట్టి పట్టెంపుఁ దవ్వుగోల
రాపులఁ బడకుండ నోపఁ గలవె?
మొక్కఁ జేసిన నాదిమొనవాఁడి కఱుకోల
తోలువులఁ బడకుండ నిలువఁ గలవె?
మలుపు చేసిన కోఱ ములుపంటి నిడుగోల
బారినిఁ బడకుండ బ్రతుకఁగలవె?
నీ బ్రతుకు నీవు చూచికో నేర కిట్లు
లలితవాసంతికాలవాలమునఁ జేరి

యలముకొనఁ జూచె దిది యేటి యాస నీకు?
దుడుకు నేఁతల కొడఁబడి చెడకె తృణమ!
ధ్యానింపనేల ధాత్రీనందనాసక్తిఁ
గులనాశనము దెచ్చికొనఁగ నేల?
కోరంగనేల కేదారకన్యాలీల
దుంపనాశనముగాఁ ద్రుంగ నేల?
కామింపనేల యారామలతాతన్విఁ
గూఁకటి వ్రేళ్లతోఁ గ్రుంగ నేల?
ఆసింపనేల సీతాసన్నిధానంబు
మూల విచ్ఛేదమైపోవ నేల?
గడ్డిపోఁచ! నీకింత పోఁగాల మేల?
మరగి చెడిపోక నా బుద్ధి తెరువుఁ బట్టి
డొంకలను బట్టి తుమ్మబీడులనుబట్టి
పశువులను గాచికొని యైన బ్రదుకరాదె!

## అగ్నిపరీక్ష

శ్రీకరాలోకు లుత్తమశ్లోకు లగుచు
సార్థకాగ్ని పరీక్షలో జయముఁ గన్న
కీర్తిమూర్తుల నక్షరాకృతిగఁ జేయు
ధీరకవిలేఖినికి నమస్కార శతము.

సములలో నుత్తమత్వము సుస్థిరంబుగాఁ
గాంచి లోకము మెచ్చఁ గన్నవారు,
ధర్మపద్ధతి నసిధారావ్రతంబుగాఁ
గాంచి యచ్చపుఁద్రోవఁ గన్నవారు,
ఒడలు జీవముఁ బరార్థోపయుక్తంబుగాఁ
గాంచి పున్నెపుఁబంటఁ గన్నవారు,
సంపద్విపత్తుల సత్యమే యూఁతగాఁ
గాంచి శాంతిపదంబుఁ గన్నవారు,
చన్నవారయ్యు జగతిలో నున్నవారు
కాలకాలాంతరముల మేల్గన్నవారు
మానధనులైన వారెప్పు డేనొకప్పు
డుజ్జ్వలాగ్ని పరీక్షలో నున్నవారె.
తరుగువాఱిన బొగ్గు వజ్రమే యగుఁగాక
యగ్ని పరీక్షయం దవతరించి,
పట్టువాఱిన పొగ పసదమే యగుఁగాక,
యగ్ని పరీక్షయం దాఱితేఱి,

గరుసువాఱినమట్టి కనకమే యగుఁగాక
యగ్నిపరీక్షయం దడుగువెట్టి,
అసలువాఱిన రసం బమృతమే యగుఁగాక
యగ్నిపరీక్షయం దాఁగినిలిచి,
గౌరవమె యున్న నెంతయో ఘనతయున్నఁ
గలిమియే యున్న నెంతయో బలిమియున్న
సార్థకాగ్ని పరీక్షలో జయము గనక
మర్త్యుఁ డేనాఁటికైన నమర్త్యుఁడగునె?
సిరిలోఁ బుట్టిన నేమి, మోహానకళా
శ్రీకుండౌ గానేమి, సుం
దరరేఖాంచితుఁడైన నేమి, విబుధా
ధారుండు గానేమి, బం
ధురవృత్తంబును గన్న రాజకులచం
ద్రుండైన నేమీ, విన
శ్వరకీర్తిం గనుఁబెట్టు పావకపరీ
క్షాసిద్ధి గాకున్నచోఁ
కనకాచలంబైనఁ గరఁగి నీరగుఁ గాని
తలఁగునే నిశ్చల ధైర్యలక్ష్మి,
పారావారంబైన పట్టిబీడగుఁ గాని
ప్రిదులునే విపుల గాంభీర్య మహిమ,
గ్రహరాజమణియైన గతితప్పి చనుఁ గాని
సడలునే నిర్మల సత్యదీక్ష,

వహ్నిమండలంబైన నసిచెడి పడుఁగాని
జాఱునే సత్క్రియా సహనశక్తి,
పుణ్యపాప సుఖాసుఖ భోగరోగ
మిత్రశత్రు శుభాశుభ మిళితమైన
జగతి నగ్నిపరీక్షలోఁ దగులువేళ
మమత విడఁబోరు, పడఁబోరు మానఘనులు.

చల్లగా వినవచ్చు సత్యసంగీతముల్
కల్యాణవిజయ శంఖముల లోనఁ,
ప్రియముగాఁ గనవచ్చుఁ బ్రేమరత్నంబులు
ఘనమంగళారాత్రికముల లోనఁ
దనివిగాఁ గొనవచ్చు దానకంకణములు
ప్రవిమలోదాత్త పాత్రముల లోన
హాయిగాఁ దినవచ్చు నమృతఫలంబులు
పావనభాగ్య కల్పముల లోన
అగ్నిసాక్షికముగ నాత్మసర్వస్వంబు
విశ్వహితము గోరి వ్రేల్చు నట్టి
యజ్ఞదీక్షఁ గొన్న యఖిలపావనమూర్తు
లున్నచోట జయము గన్నచోట.

కనకధరాధరేంద్ర మొక
గవ్వయుఁ గాదు; సురేంద్రలోకనం
దనవనవైభవం బొక తృ
ణంబును గాదు; ప్రకృష్టభోగజీ

పన మొక లెక్కఁగాదు; భవ
పావనపావక సత్పరీక్షలో
ననితరలోకలభ్యవిజ
యాభ్యుదయంబులు గోరువారికిన్

ఘోరదుస్సహ ఘనాసార మైననుసరే
సిద్ధచారణ పుష్పసేచనంబె,
దారుణజ్వాలా సమీర మైననుసరే
సౌరభాచల మందమారుతంబె,
గ్రీష్మప్రచండతాపోష్మ మైననుసరే
సితచంద్రచంద్రికా శీతలంబె,
భీషణాశని వినిర్ఘోష మైననుసరే
ఖేచరీమధురసంకీర్తనంబె,
వాంఛనీయ స్వధర్మ నిర్వాహమునకుఁ
బావనాగ్ని పరీక్షలోఁ బాలు గొన్న
యచలదీక్షాపరుల కద్వయాత్ములకు
భీకర శ్రీకరంబు లేకాకరములె!

అకలంకచరితుల నాపన్నులుగఁ జేయఁ
బూని విశ్వామిత్రు లైననేమి
పావనవ్రతుల దుష్పథదూషితులఁ జేయ
నెంచి రాక్షసవృత్తిఁ గాంచనేమి
సద్ధర్మనిరతులఁ జలచిత్తులుగఁ జేయఁ
దలఁచి దయ్యపురూపుఁ దాల్చనేమి

సద్యోభ్యప్రియములఁ [illegible]
యత్నించి యుగ్రంబు లైనను
తథ్యమిథ్యావివాదమధ్యస్థ పాప
నామృతాగ్ని పరీక్ష లోనైన శుచుల
సత్యనిర్మలచరితంబు శాశ్వతముగ
నవని వెలయించువాఁడ బంసువ్రతీశారె!

కలుషము లొంద లేవు, మమ
కారము లందఁగ లేవు, దుఃఖసం
కలితకరాళఘాతికవి
కారము లూనఁగ లేవు, నిత్యచం
చలవిషయప్రలోభగుణ
జాలము లావఁగ లేవు నీరు లై
యలఘుపదంబు జూఱఁగొన
నగ్ని పరీక్షలఁ జేయుధీరులన్.

ఆనందనందనోద్యానంబు నందైన
సంతానపత్రముల్ సంస్కరించి,
మానసకాసార మధ్యంబు నందైన
స్వర్ణాబ్జ సూత్రముల్ సంతరించి,
సత్కళాసంపూర్ణ శశిబింబ మందైన
సిద్ధామృత రసంబు నేకరించి,
చారురోహిత శక్రచాపంబు నందైన
సదమలవర్ణముల్ సంగ్రహించి,

సార్థకాగ్ని పరీక్షలో జయముగన్న
విశ్వనుతకీర్తులకుఁ గీర్తివిజయపత్ర
సత్కృతులఁగూర్చి వెలయించు శాశ్వతముగ
సత్కవిబ్రహ్మ మంగళాశాసనములు!

---

## ని ర్వే ద ము

పావనగుణకులశీలము
లేవంకకుఁ బోయె, శాంత మెటుసనె, బ్రహ్మ
శ్రీవిలసితునకుఁ జండా
లావేశం బేలకలిగె నశ్వత్థామా!

అకటా! భూభువనప్రశస్తమగు ద్రో
ణాచార్య వంశాబ్ధిమా
నికముంబోలి జనించి గౌరవమునన్
దేజంబునన్ మించియుఁ
సకలాస్త్రానగతిఁ వెలుంగక విష
జ్వాలాకరాళోద్ధత
ప్రకృతిం గాంచితి, దోషదూషితులు గో
త్రఖ్యాతిఁ బాటింతురే.

గీ॥ సేసటమైన, నరకా
నలకీలలఁ బడుటైన నాకు భరంబే!
తలమానికమే లేగి, నిం
దల పాలగుకంటెఁ బాపతాపముకంటెన్.

ధర్మపుత్రాదులు దాయాదులే నాకు
సహజస్వధర్మమే శాత్రవంబు,
వీరవిహారముల్ విహితంబులే నాకు
సమ్మతాచారమే సంగరంబు,
నిష్ఠురారంభముల్ నియమంబులే నాకు
సముగతాభ్యాసమే యాగ్రహాగ్నిబు,
భయదాస్త్రశస్త్రముల్ పరతత్త్వములె నాకు
హితకరోద్యోగమే హింసనంబు,
అతిథిసత్కారమో, దేవతార్చనంబో,
బ్రహ్మచింతనమో, వేదభాషణంబో,
స్వర్గమో, మోక్షమో, లోకసంగ్రహంబో,
పరవినాశనకృతియేల బ్రాహ్మణునకు!

సురభిళమృదుల ప్రసూనంబనై పుట్టి
కుటిలకంటకవృత్తిఁ గూలినాఁడ,
లలితమోహనకలాలాపంబనై పుట్టి
తుచ్ఛవాయసవృత్తిఁ దూలినాఁడ,
దివ్యనిర్మలరత్నదీపంబనై పుట్టి
దావపావకవృత్తిఁ దాల్చినాఁడ,

సురుచిరనవసుధాకిరణంబనై పుట్టి
గరళదంశసవృత్తిఁ గాంచినాఁడ,
సౌమనస్యమెడలె, సాధువాదముపోయె,
గౌరవంబుగ్రుంగెఁ, గళవళించె,
బ్రతికిమరణబాధ పాలైతి నాకింక
నాకమేడ, ఘోరనరకమేడ!

చూపులఁ జూపులు జోడించి శూరులై
కలన నన్నెదిరించి నిలిచినారె
కరములఁ గరములు గదియించి ధీరులై
దురమున నాకాలు ద్రొక్కినారె
బిరుదులు బిరుదులు మొఱయించి వీరులై
బవరాన ననుఁగొంచె పఱచినారె
కత్తులఁ గత్తులు హత్తించి క్రూరులై
యేడ్తెఱ ననునొవ్వ నేసినారె
కయ్యమేలేక నిద్దురఁ గన్నవారి
గొంతుకలు గొల్లుమనఁ దెగఁ గోసినాఁడ
జ్ఞానమేలేని, దయలేని, శంక లేని
పరమచండాలుఁడనుగాని బ్రాహ్మణుఁడనె!

కన్నుల నెన్నో పీనుఁగు
లున్నట్టులె, చెవుల మూల్గు లున్నటులె, యహా
చున్నది; మతిచెడు చున్నది,
యెన్నాళ్ళీ రోగబాధ కే నేడ్తు శివా!

పరమకిరాతవృత్తి జిగ
పాలకమాడలఁ బట్టి యాడలల్
ఖరకరవాలధారకెఱ
గా నొనరించెడు వేళఁ గ్రిందుమీఁ
దెఱుఁగక సంచరించి తుద
కిట్లు పరాభవతాపపావకు
ర్జ్వరపరితాపదుఃఖముల
పాల్పడితిన్ జెడితిన్ జగంబునన్.

కుటిలమార్గముఁ బట్టి కులముగూల్చుటె గాని
గురుకీర్తి నిల్పఁగా నెఱుఁగనైతి
ఖండనంబునఁ జేరి భంగపందుటె గాని
సవ్యసాచి నెదుర్పఁ జాలనైతి
బిరుదుమాటలు సెప్పి పెనఁగులాడుటె గాని
రారాజు మెప్పింపనేరనైతి,
క్రూరకృత్యమొనర్చి గొంతులూడ్చుటె గాని
వీరగౌరవ మొంద నేర నైతి,
సత్యశౌచదయాధర్మశమదమాది
సత్క్రియాసంతతికి జలాంజలి యొసంగి
భవవినిష్కృతిలేని పాపము గడించి
హారహారా! యెంత దుష్క్రియా పరుఁడనైతి!
కావిదోవతిఁ జించి కాసెకోక బిగించి
చెలరేఁగి కులవృత్తిఁ జెఱచికొంటి

ధర్మశాస్త్రము మాని దారుణాస్త్రముఁ బూని
సివమెక్కి పాపంబుఁ జేసికొంటి
యజ్ఞహాసము రోసి యట్టహాసము సేసి
తెగసాగి తలవంపుఁ దెచ్చికొంటి
స్వస్తివాక్యము వీడి సమరగీతముఁ బాడి
కైపెక్కి జీవంబుఁ గలఁచికొంటి
విశ్వవిహితమైన విప్రధర్మముఁ దూల్చి
గోప్యమైన రాజకులముఁ గూల్చి
పెద్దపేరుమాసి జీవచ్ఛవంబనై
పరిభవమునఁ బడియు బ్రతికియుంటి.

కలుషదూషితముగాఁ గలఁగిపోయెనె గోత్ర
పావనంబైన నాజీవనంబు
క్రూరదుర్మతముగా మాఱిపోయెనె ధర్మ
సాధనంబైన నాబోధనంబు
దుఃఖదుర్భరముగా దొరలిపోయెనె సాధు
కీర్తనంబైన నావర్తనంబు
ప్రళయభీకరముగాఁ బ్రబలిపోయెనె ప్రేమ
దౌహృదంబైన నాసౌహృదంబు
భూమిదేవుఁడేడ భీమాహవంబేడ
హేయబుద్ధియేడ హింసయేడ
అసురబుద్ధిఁ జేసి యపవర్గమార్గంబు
మాసికొంటి నింద మోసికొంటి.

అఘమర్షణస్నాన మైపోయెనే సాధు
జనకోష్ణ రక్తవాహినుల లోన
ఔపాసనక్రమం బైపోయెనే తీవ్ర
ముఖరాస్త్రజని తాగ్నిశిఖల లోన
ఆరాధనవిధాన మైపోయెనే క్రూర
మారణ మంత్రకర్మముల లోనె
ఆనందనర్తనం బైపోయెనే మిత్ర
శవపూర్ణరణనివేశముల లోన
భూసురత్వమెల్ల బుగ్గిపాలై పోయె,
సాధుశీలమెల్ల నమసిపోయెఁ
జావులేనిబ్రదుకు నంకటమైపోయె,
శివశివా! యిఁకేమి సేయువాఁడ!

## ఉత్కంఠ

నిలువెల్లఁ గన్నైనఁ దిలకింపఁ గలనేమొ
వెతదీర నీలీల విశ్వమూర్తి!
పలుకెల్ల శ్రుతియైనఁ బాడంగఁ గలనేమొ
ప్రియమార నీకీర్తి ప్రేమమూర్తి!
పొడవెల్లఁ బొలుపైనఁ బోలంగఁ గలనేమొ
తనివార నీహేలఁ దత్త్వమూర్తి!
గతియెల్ల నతమైనఁ గలయంగఁ గలనేమొ
యలరార నీమూర్తి నాత్మమూర్తి!

నిన్నుఁ జూచు కన్నె నీమెచ్చు పాటయే
నీయొడందగూర్చు సోయగంబె
నీవు నేనుగాఁగ నెగడెడిభాగ్యమే
నా కొసంగుమయ్య లోకనాథ!

శ్రీ త్స త్ర ధో ధ వః

సర్వగ్రసముఁడవు, స్వాహా
ఖర్వోద్రేకమునఁ బ్రకృతిగానమున సుఖాం
తర్విన్యస్తుఁడవు, సూఱిల
సర్వజ్ఞుఁడ వీ వఖండశక్తుఁడవు కవీ!
నింగికి నిచ్చెనల్ నిర్మింపఁగల శక్తి
నీటిలో జాడల నెమకుశక్తి
ఎండమావుల నీరునిండింపఁగల శక్తి
గగనపుష్పంబులఁ గాంచుశక్తి
గాలిలో మేడలఁ గట్టింపఁగల శక్తి,
ఁపుల వార్త్మాళిచేయుశక్తి
భావసంతతికి రూపముఁ గూర్పఁగల శక్తి
సృష్టికిఁ బ్రతిసృష్టి సేయుశక్తి,
ప్రకృతితత్త్వములను బరికింపఁగల శక్తి
ప్రకృతి మఱఁగఁజేయు ప్రౌఢశక్తి
సర్వశక్తులను బ్రసాదింపఁగలశక్తి
కవిత నీకుఁగలదుగా కవీంద్ర!

తృణము మేరువుగాఁగఁ దృణముగా మేరువుఁ
జిత్రించి గారడుల్ చేసి చేసి
తిట్టు దీవనగాఁగఁ దిట్టుగాదీవనఁ
ట్టించి చిడుముడుల్ పెట్టి పెట్టి

కల్ల నిజంబుగాఁ గల్లగాఁగ నిజంబుఁ
బచరించి చీకాక్కు పఱిచి పఱిచి
గుణము దోషంబుగా గుణముగా దోషంబు
వెలయించి తబ్బిబ్బుఁ గొలిపి కొలిపి
మాయలాడిప్రకృతి మరఁగి చెర్లాటల
నెట్టు లాడుకొన్న నేమిగాని,
పాడి తప్పనీకు పరతత్త్వబోధలఁ
బేరు నిలిపికొనఁగఁ గోరితేని.

బ్రహ్మసూత్రంబుతోఁ బడేవుసానిహొరంగు
పొంబట్టు లంగాకుఁ బొందు చేసి
గడసాని పారాణికాళ్ళతో వైష్ణవ
పంగనామాలకు రంగు వైచి
ముసలిగ్గడ్డంబుతోఁ బసిబాల చిన్నారి
చెక్కుటద్దాలకుఁ జెలిమిఁ గూర్చి
వశ్యమంత్రములతో వైరిదుర్జయవీర
శైవదీక్షితునకుఁ జదువు సెప్పి
ఇచ్ఛవచ్చినట్టు లెన్ని యో ప్రకృతులఁ
గూర్చి మార్చి పాడుకొనుము గాని
పాడితప్పనీకు పరతత్త్వబోధలఁ
బేరు నిలుపుకొనఁగఁ గోరితేని.

ప్రకృతి బాహ్యప్రలాసము విలాసము కాంచి
కుతిదీఱగాఁ బాడుకొను నొకండు,

ప్రకృతి యంతర్వికారమె వికాసమై కాంచి
చెల రేఁగి నృత్యంబు సలుపు నొకఁడు,
ప్రకృతిలో లీనుఁడై భావనాధీనుఁడై
హాయిగా గానంబు సేయు నొకఁడు,

ప్రకృతికి భిన్నుఁడై ప్రక్రియాపన్నుఁడై
యువకుఁడై తెయితక్క లాడు నొకఁడు,
చైత్రి వివిధముల వెలువడునట్టులే
కవిత కోటిగతులఁ గ్రాలుచుండు

నన్నుఁబోలలేదు నాజాతివాఁడని
తోడివాని నెగ్గు లాడనేల?
సరసంపుఁ బదముల సవరింపఁ జనుఁగాని
సిద్ధంపుఁ గృతుల నిందింపనేల?
షట్పదశ్రుతివిలాసముఁ బాడఁదగుఁగాని
కల్యాణికై వ్రేలు గఱవనేల?
ఆటవెలందుల నలరింప నగుఁగాని
తేటగీతులఁ దప్పఁ దీయనేల?
వనమయూరములీల మనుట యొప్పగుఁగాని
మత్తకోకిల వంక లొత్త నేల?
గాయకునకు నీకుఁ గలదొక్కటియె తిక్క
బ్రదుకుఁ దెఱవు కొఱకొ పరువు కొఱకొ
సత్యగౌరవములఁ జంపి గాయకవ్యాళి
గాఁడితండు సుకవి గావు నీవు.

పలుకిచ్చినంతనే పలుకాయెఁగా యంచు
నౌచిత్యమును విడనాడ కయ్యా!
కలమూఁచినంతనే గతిగల్గెఁగా యంచు
సారస్యమున మేరమీఱ కయ్యా!
తలద్రిప్పినంతనే తలపాయెఁగా యంచుఁ
జెలువంపుగతి వాయఁజేయ కయ్యా!
కనుగొల్పినంతనే కళదోఁచెగా యంచు
లలితంపుజిగి సాఁగలాగ కయ్యా
బాసవచ్చునంచుఁ బలుకనేర్తున టంచు
రసము విఱుగుదాఁకఁ బ్రకృతి నచ్చినదాఁకఁ
దీఁగ లాగిలాగి త్రెంప కయ్యా!
నిమ్నసంబునకు నొక్క నెఱవన్నెఁ దులకించు
ప్రకృతియే నీప్రియురాలు—నిజము
గడియలో నెన్నియో కల్పనల్ పుట్టించు
ప్రజ్ఞయే నీయూఁతపట్టు—నిజము
అవలీల జగమెల్ల నవహోంబుఁ గావించు
పాటయే నీస్వభావంబు—నిజము
సులువుగా బ్రహ్మాండవలయంబు నెలమించు
కవితయే నీజీవగఱ్ఱ—నిజము
నీవు నీవుగాఁగ నిలిచి నీమర్యాదఁ
గూడ జగతి నిలుపుకొనుము గాని

వేష్టనైనఁ వస్త్ర గ్రంథములన్న
పథముఁబట్టి నిల్పినదెవరయ్యా!
కవిగీత మూర్తిగాఁ గాంచిపిల్చిన నీవు
పికకూజితమునకే చెవుడు లేల?
ప్రకృతిప్రబంధంబు వాసిమాపిన నీవు
సరసబంధమునకే జంక ఏల?
పార్వతీపరమేశ పదభావనల నీవు
ప్రకృతిపూరుషులకే భ్రమము లేల?
ధ్వనిజీవమైన యుపన్యాసమంద నీవు
పలుకుపొందికలకే యులుకు లేల?
ప్రణయరసముఁగొలిపి ప్రకృతిని వలపించి
పవళింతుఁ గూర్చపాటఁ బాడ
ఎన్నొ యాటలాడు నిట్టు లేకాంతె
సేవ నింత వదలిపోవు టేల!
కవివై పాడుము నీమది
దవిలినగతిఁ బోదుగాక తగవులిడిచి స
త్కవి కవితల వివరించెదు
నవనరములఁగూడఁ గవిత లల్లకుము కవీ!

# పద్మిని

చిఱునవ్వు నవ్వితే చెంగల్వరాయఁడే
అమృతంబు నీయింట నడుగరాఁడె!
ఒక్కింత చూచితే చుక్కలరాయఁడే
వలరుచుల్ నీకంట విలువరాఁడె!
తలయెత్తఁ గలిగితేఁ దెలిఱెక్కరాయఁడే
కలిమిమై నీవెంటఁ గొలువరాఁడె!
చనవీయఁ దలఁచితేఁ చలువలరాయఁడే!
తావుల నీజంటఁ దనియరాఁడె!

పలుకు వినవుగాని; పట్టు వీడవుగాని
ఒక్క యినునె వలచియుంటి గాని
పద్మినీ! యొకింత భావింపఁ గలిగితే
కొనరి జగము జట్టిగొనవఁ టమ్మ!

# కవిహృదయము

తీర్చుచో మీ విభూతిత్రిపుండ్రము మీఁదఁ
దోఁచునే కమ్మ కస్తూరి రేఖ
కట్టుచో మీ మేని కనకాంబరము మీఁద
జాఱునే పులితోలు చీర చెఱఁగు
పూనుచో మీ శేషభుజగహారము మీఁదఁ
బొలుచునే చిగురాకు పూల పేరు
కదలుచో మీ యున్న ఖగవాహనము మీఁద
మెఱయునే వృషరాజ వర పతాక
శైవ వైష్ణవ మతభేద సరణి వీడి
యద్వయానంద రసరసాయనము మీర
లొక్క దొన్నెనే సేవించు చున్నవారె!
రాజశేఖరకవిరాజ రాజులార!

పరిపాక పరిమళ ప్రసవమంజరులతోఁ
దులకించె మీ జాతి విలసనంబు
వరవైభవార్ధ సౌవర్ణ సంపదలతోఁ
గళదేఱె మీ పద గౌరవంబు
మధురస్వభావ సన్మణిమయ ద్యుతులతో
మతి కెక్కె మీ యలంకృతి గుణంబు
సరసప్రసన్న బంధుర చంద్రకళలతోఁ
గడ లొత్తె మీ కీర్తి కౌశలంబు

శైవ వైష్ణవ గాథాప్రశాంతభావ
పావనోజ్జ్వల దివ్య ప్రబంధ లీలఁ
బ్రకృతి కంఠానఁ బాడిన ప్రభువులార!
రాజశేఖరకవిరాజ రాజులార!

మెలుపారు నభినవోత్పలముల నొక కొన్ని
చెలువొందు వనమంజరులను గూర్చి
రుచిమించు వికచాంబురుహముల నొక కొన్ని
కమనీయ మగు చంపకములఁ జేర్చి
శోభించు సురలతాసుమముల నొక కొన్ని
కొమరొందు మధుమాధవములఁ దీర్చి
నొరసంపు మృదుసుకేసరముల నొక కొన్ని
రమణీయ మగు నాగరము లమర్చి
సద్గుణకళావిభాసులై సరసవృత్త
మాలికల భారతీదేవి నేలికొన్న
కృతుల రసమంజరీ సమన్వితులు మీరు
రాజశేఖరకవిరాజ రాజులార!

రసమయోత్తుంగ తరంగాభిషంగ వి
డంబీకృతార్థ శబ్దాంబరములు
పృథుల వృత్తాచ్ఛగంభీరప్రచార గ
ర్భీకృతధారాసరిద్వరములు
క్షుణదంతరంగప్రసన్నాత్మాదర్శబిం
బీకృత భావకసాకరములు

అరవేలనాటి నన్నతి సముత్కృష్టపు
శ్రీకృష్ణ పవిత్ర శ్రీకరములు
స్థిరవిభవ శంకరీకృత శ్రీధరములు
సమహిత శ్రీధరీకృత శంకరములు
శాశ్వతీన ప్రబంధ రత్నాకరములు
రాజశేఖరకవిరాజ రాజులార!

రజత కుత్కీల గర్భంబులో వైకుంఠ
దివ్యధామము గల్పు తెఱచు వారు
తిరుమలదేవ మందిరములో జంగమ
మల్లికార్జున సేవ మఱఁగు వారు
భవ్యకుమారసంభవలీలలో విష్ణు
చిత్తసారము ప్రవచించు వారు
శ్రీకృష్ణదేవ విశిష్ట తేజంబులో
చోడేశ్వరుని మూర్తిఁ జూచు వారు
హరిహరసనాములు సమానులైన వారు
కవిత కిద్దరి నద్దరిఁ గన్న వారు
కాక మీ కీర్తిమూర్తులఁ గాంచఁ గలరె?
రాజశేఖరకవిరాజ రాజులార!

## ఏ మ ను భ విం తు వు?

అమృతమెల్ల హరించి యా సోమనాథుండు
పట్టి భాండమె దిగఁ బెట్టి నాఁడు
వలపులెల్ల హరించి వాయుగంధర్వుండు
పట్టి వృంతమె దిగఁ బెట్టి నాఁడు
మహిమయెల్ల హరించి మదనాగ్ని రూపుండు
పట్టి కోనమె దిగఁ బెట్టి నాఁడు
కళలనెల్ల హరించి కాలభైరవమూర్తి
పట్టి గూటిని దిగఁబెట్టి నాఁడు

భావభవుఁ డెందొ తన పంచ బాణములను
కట్టగాఁ గట్టుకొని పాతిపెట్టి నాఁడు
హాలికా! హాలికా! పట్టియాన గాక
ఏమనుభవింతు వీ రుద్రభూమి లోన?

## మా కవిత

శ్రీవారికిఁ గాళింది
శ్రీవారికి విష్ణుపదకుశేశయనిలయ
శ్రీవారి కెరఁగి మత్కవి
తా వారికిఁ గ్నాస్త్ర విమలతావిస్ఫూర్తిన్.
వాల్మీకి భాస్క రావ్యాయ గాయకుల చేత
మ్రోఁగించె నేదేవి ముక్తివీణ
వ్యాసవాక్యానన వనపదాస్యుల చేతఁ
బూరించె నేదేవి భుక్తి పాత్ర
బాదరాయణపోతభద్ర నావికులచేఁ
బట్టించె నేదేవి భక్తి నౌక
బాణమూర్ఖ్వప్రతిభా చిత్రకరులచే
రచియించె నేదేవి రక్తివల్లి
ఆదికవులకు మున్నె తా నవతరించి
జ్ఞానదానవిజ్ఞానప్రదాన యగుచు
నిత్య సంకీర్తనంబుల నేఁడు నాఁడుఁ
దనరు నాదేవి మాకవితాకుమారి!
చనవిచ్చి పలికెనా చదువుసోమరు లైన
భారతీకాంతులై తీరవలయు

మనసిచ్చి మనలెనా పుసుకమేపరు లైన
స్థిరమంగళాంగులై తీరవలయు
కనువిచ్చి చూచెనా కడుపుఁ గాఁపరు లైన
శ్రీరమారమణులై తీరవలయు
తనువిచ్చి తనిసెనా తబిసితక్కరులైన
స్వారాజ్యవిభవులై తీరవలయు
తనకు వాయిల్లె మేయిల్లె యనఁగనేల!
తనకు శివమిల్లె దివమిల్లె యనఁగనేల?
తెలిసి జగమిల్లె యని చెప్పి తీరవలయు
శ్రీకుమారియె మా కవితాకుమారి!

గండపెండెర మన్న ఘనత సేయదు గాని
కవిచంద్రుఁడే వంశకర్త యనును
వందిమాగధు లన్న వంక సేయదు గాని
సత్యపాలుఁడే మతాచార్యుఁ డనును
రణకిణాంకము లన్న గణన సేయదు గాని
శౌర్యధుర్యుఁడె కులస్వామి యనును
దానకంకణ మన్నఁ దలఁపు సేయదు గాని
త్యాగమూర్తియె సహోధ్యాయి యనును
సాధుమణి యన్న మెచ్చుకోఁ జనదు గాని
ధర్మరక్షకుఁడే తన దైవ మనును
ప్రకృతి పురుష స్వభావ తత్త్వములు గన్న
భావమణిపేటి మా కవితావధూటి!

ఎండమావుల నీరు తెచ్చు నేర్పు కాదు
హృదయేశ్వరున కర్ఘ్య మీయ నేర్పు
ఆకాశకుసుమంబు లందు నేర్పు కాదు
జీవితేశ్వరు పూజ సేయ నేర్పు
నిండువెన్నెలవల్వ నేయ నేర్పు కాదు
చిత్తేశు మేనఁ గైసేయ నేర్పు
గాలిలో మేడలఁ గట్ట నేర్పు కాదు
ప్రాణేశు కొల్వు గూర్చుంగ నేర్పు
శూన్యమున నంకె మున్న నేర్పుటయు కాదు
విశ్వవిభు నందు నిల్పి సేవింప నేర్పు
నేర్పు నేర్పనఁ బ్రకృతి నన్నిందుబోటి!
తలఁపుఁబువుఁదేటి మా కవితావధూటి!

మనసాగతిఁగల నొక్క మాటఁగ లేదు
జీవంబ దేటికే చెతరించు?

పవడంపుఁజివురుల బారుమెట్టఁగ లేదు
ప్రాణంబ దేటికే పట్టు దప్పు?
విరిపూవుగుత్తుల విరియఁ జిమ్మఁగ లేదు
భావంబ దేటికే పరువు లెత్తు?
కప్పురంపుఁ బలుకులఁ గలయఁ గ్రుమ్మఁగ. లేదు
హృదయంబ దేటికే కదలఁ బాఱు?
పలుక విడిచేను ప్రకృతి? నేఁ బలుక కున్న.
బలుకరింతువె? పరమేశ!-భ్రాంతి కాక?

పలుకు మని నవ్వ పరమేశుప్రకృతిలీల
నాకవిత పాడుచున్నది-మాపు ఱేపు.

౨

అలరుటమ్మ్వలె కాని హావణింపదెంత దు
ర్లభమైన విజయాభిలాషయున్న,
మెఱుఁగుటమ్మ్వలె కాని ధరియింప దెంత తీ
వరమైన సౌందర్యవాంఛయున్నఁ
జలువవల్వలె కాని సవరింప దెంత ము
మ్మరమైన విభవాభిమానమున్నఁ
గమ్మ్వవిందులె కాని కాంక్షింపదెంత ము
ఖ్యంబైన సత్పదార్థాశయున్న

నెంతటి నిరంకుశ ప్రభావేచ్ఛయున్న
వలపుఁదెమ్మెర తెరల వెన్నెలబయళ్ళఁ
జలువచప్రాలఁ బువ్వుఁతోఁటలనెకాని
కేళి సల్పదు నాకవితాలతాంగి.

ఎలదేఁటిపాటలను జి
ల్కలపలుకులఁ గోకిలముల కలనాదములన్
పిలిచిన నాకవితకుఁ గ్రొ
త్తలుగా వనశిష్టరాగతాళస్వనముల్

ఎవరేమన్ననఁ, మరేమనుకొనరాఁ, డెల్ల
కాలంబు నూ
కవితాసుందరి స్వాత్మ్యయావనము నాకాంక్షిం
చునేకాని, గౌ
రవవృత్తంబుల, వేషభాషలఁ, బదార్థజ్ఞాన
సంసిద్ధులకా
లవలోపంబు సహింపఁబోదు నవహేలా
మోదలీలాత్మయై.

---

## త్రిక!

క్షీరాబ్ధి దాఁగుటే క్షేమంబు గాఁబోలు
ననుఁ బాలపాపను దనుపకుండ,
పాముపైఁ దూఁగుటే భద్రంబు గాఁబోలు
ననుఁ బాపజాతిని మనుపకుండ,
ఖగముపై నేఁగుటే సుగమంబు గాఁబోలు
నన్ను నీచపక్షిని బనుపకుండ,
ఆకుపై నూఁగుటే యభయంబు గాఁబోలు
ననుఁ జిన్న పాపను నినుపకుండ,
చిన్నడుగువారి నాఁగుటే మేలు వోలు
నన్నడుగు వంకఁ దేర్చఁగా నెన్న కుండ

గుండె సిరిచెలి కేగుఁడే గుట్టు వోలు
నండఁ గనలేని నను బ్రోవకుండ శ్రీశ!
కను విప్పకుండఁగాఁ గాఁపు వెట్టితిఁ గాని
తలఁపులోఁ దిలకింపఁ దప్పనైతి,
చెవి ద్రిప్పకుండఁగా సెలవు వెట్టితిఁ గాని
మదిలోన నాలింప మాననైతి,
పల్లెత్తకుండఁగాఁ బట్టుఁ బట్టితిఁ గాని
మనసులోఁ బలికింప మఱవనైతి,
కై మోడ్పకుండఁగా గట్టుఁ గట్టితిఁ గాని
యెడఁదలోఁ బూజింప విడువనైతి
వంక్షగించిన నా మనోభ్రాంతి నైన
వెలుపలను లోపలను నీవె కలసి మెలసి
వెలసి యున్నావు, నిన్నెట్లు వేఱొనర్పఁ
గని విని నుతించి సేవింతుఁగాక శ్రీశ!
నిన్ను సేవించిన నిడుదకైదోయితో
నితర సంసేవ సేయింతు వయ్యా!
నిన్ను నుతించిన నిర్మలరసనతో
నితర సన్నుతుల సేయింతు వయ్యా!
నిన్ను దర్శించిన నిండుఁగందోయితో
నితర దర్శనము సేయింతువయ్యా
నిన్నుఁ బల్మాఱు మెచ్చుకొన్న చిత్తంబుతో
నితర ప్రశంస సేయింతువయ్యా!

పూలు వాడవు, [illegible]
[illegible] తెసలవు, గుణములు తరిగి పోవు,
పద్మభవవంద్య! నీ పాదపద్మములను
కొలువ నెంచితి సన్నుతులొనఁగుము శ్రీశ!

శ్రీ లడిగితి నా భుక్తికి
నా లడిగితి నా యభీష్టపదభుక్తికి నీ
మే లడిగితి నా ముక్తికి
గీ లడిగితి నా కతాలకింపుము శ్రీశా!

కథనమున్న వాడ నీవట!
కథలోపలి సకలభూమికలు నీవట, యా
కథ వినెడివాడ వీవట,
కథ మెచ్చఁగ బల్కఁగ నేను కర్తనె చెప్పుమా!

నీ నేమి పలుకఁ బోయిన
కానంగల వీవు ముందె, కానని వెల్గా
గానంగల నీ శక్తికి
గానుపుఁ గానేని పలుకఁ గలనే శ్రీశా!

ఆగమనైగమోక్తిఁజతురాస్యుఁడనా
పరమార్థతత్త్వవి
ద్యాగమసూక్తిఁబంచవదనాఖ్యుఁడనా
నిగమాదిమంత్రశా
స్త్రాగమవాఙ్మయోక్తిని సహస్రముఖా
ఖ్యుఁడనా కథాయథా

థ్యాగమనూ క్తి కున్ముఖుఁడవై నను
మెచ్చెదు గాక శ్రీపతీ!

---

# జీవప్రబోధనః

౧

దేవపదము వీడి దేవతలకుఁ జిక్కి-
దేహగేహములకు మోహపడును
నిన్న నీవెఱుంగ కెన్నాళు లీ రీతి
నూఁగులాడు చుందు వోయి జీవ!

* *

చెలువలు రవణాలు చేరు చున్న కొలంది
కన్నె కైవల్యమై యున్న నీకుఁ
బొగడిక లిచ్చకాల్ పొదలు చున్న కొలంది
వీనులే వైకుంఠమైన నీకు
అభిమతార్థ ఫలంబు లందుచున్న కొలంది
నానయే కైలాసమైన నీకు
భోగవిలాసముల్ సాగుచున్న కొలంది
నొడలె స్వారాజ్యమై యున్న నీకు
బ్రదుకె శాశ్వతమని భ్రాంతి వడెడు నీకు
దుఃఖమే జీవితంబయ్యెఁ దుట్ట తుదకు

సద్యోభావోదార నిర్వృతిలైన వీని
తెలిసికొను మోయి నీ సద్గతికి నే!

*　　　*

ఊంకించి ఘనసిద్ధి నందుకొనఁగఁ బోయి నీ
మొగముపైఁ బడెనంచు మురుఁగు టేల
కదిసి జగత్ప్రాణు ఖండింపఁ బోయి నీ
మెయి గాయపడెనంచు మిడుకు లేల
ఎద్దెలుఁ బావకు నెగనూదఁ బోయి నీ
మూతి గాలిపడంచు మూల్గు లేల
ఉదుటున వాహిని కెదురీదఁబోయి నీ
పుట్టి మున్గెనటంచుఁ బొగులు లేల
మదనముగ్ధతనదెలి నిన్నె దిద్దఁ గనక
అతలకుతలాలఁ బడి యధోయానలఁ బడి
మనసుపడి చేసికొన్న కర్మమునఁ ఫలము
జీవుఁడా! కట్టి కుడుపక పోవదోయి!

*　　　*

మాయచూపులు చూచి మరులు కొందువు గాని
మున్ను నీకిట్టి కన్ను న్న యదియొ,
మాయమాటల నాడి మనసు కొల్లెదు గాని
మున్ను నీ కిట్టి నోరున్న యదియొ,
మాయచేతలు చేసి మహిమఁ జూపెదు గాని
మున్ను నీ కిట్టి నేర్పున్న యదియొ,

మాయవేసాల్ నైచి మసలు చుండెదు గాని
మున్ను నీ కిట్టి తీరున్న యదియె
పట్టి చూడంగ నామరూపాలు లేని
నిర్గుణుఁడ వయ్యు నున్న వన్నియును నావె
యన్నిటికి నేనె యని రజ్జులాడు కొనెద
వొక్కపరి తేటచూచుకోవోయి! జీవ!

౨

జీవప్రబోధ నామక
భావానంద ప్రబంధబంధుర భాషా
ప్రావీణ్యము వెలయించిన
దేవిఁ, జగదంబ భారతిని సేవింతుఁ.

*　　　*

అంటఁగారాని మాయాంచలం బంటి
పిన్నవై పెద్దవై ప్రేమభావమున
పాల నోటనె పెద్ద పలుకులు పలికి
పాలపాపలఁ గాంచి, ప్రకృతి మోహించి
నాచెలి, నాబిడ్డ, నాప్రాణ మను
విశ్వకుటుంబంబు వింతగాఁ బెంచు
ఆశానుబంధపాశార్తికిఁ జిక్కి చి
ఆద్యంతశూన్యుండవై యున్ననీవు
తుదియేది మొదలేది తోఁచకున్నావు
తుదిదాఁక బోదువా దోసంబు లేదు

మునపటికే గొనుకా మొగంబా లేదు
అదినాకె యిదినాకె యంతనాకేయనుచు
దుడుకుమిది లెఱిఁగి ప్రస్తుతిఁ గాంచునేని
నడిమింటి చిక్కులు నాఁటనే లేవు.
జీవుఁడా నీలోనఁ జిక్కుకొన్నాఁడర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నాఁడర!

*　　　　*

కొడుకుల సంపదఁ గూర్చియే చింత
కూఁతుండ్ర సుఖమును గూర్చియే చింత
యిల్లాలి పెత్తనం బెంచినను చింత
మనుమల కమ్మని మాటకే చింత
తనవారి కనియిట్లు తలపోత లాయె
తనముందుగతిఁ గూర్చి తలఁపలే దాయె
తనకనిత్యం బైన ధనరాశి కొఱకు
తనకనిష్టంబైన తగులంబు కొఱకు
తనుఁ గానివానిఁ జిత్తంబున్న దలచి
తనకదియె ధన్యతమ మని తలంచి
ఆత్మను బంధంబు లన్నియుఁ మఱచి
మోహాన బంధమేమో నిజం బనుచు
తనకుమాలిన యట్టి ధర్మంబు కొఱకు
పరమార్థ మెఱుఁగక పరువు లెత్తెదవు.

జీవుఁడా నీలోనఁ జిక్కుకొన్నదిర!
దేవుఁడా యనిపించు • తెలివియున్నదిర!

*                *

వింటివే యేశాస్త్రవిధులలో నైనఁ
గాలంబు వెనుకకుఁ గాఁదిన యట్లు
కంటివే యేలోక కథలలో నైన
వాహిని వెనుకకు వచ్చిన యట్లు
కాలంబు నీగట్టు కదిలి పోయినది
వాహిని నీవంక వదలి పోయినది
నీకన్న వారికి నిలుకడ లేదు.
నిలుకడఁ గనియున్న నీ జీవనమునఁ
గన్నవారికి నీకుఁ గలియని యపుడు
నీ యాత్మగతికిఁ జింతించుట మాని
వారికై నీకన్నవారికై యిట్లు
కన్నీరు విడుచుట కళవళపడుట
తగులంబు గూర్చిన తటపట గాదె
మోహంబు పేర్చిన ముచ్చట గాదె!
జీవుఁడా నీలోనఁ జిక్కుకొన్న దిర
దేవుఁడా యనిపించు తెలివి యున్న దిర!

*                *

జీవితంబే తనచేతఁ బెట్టితివి
మూలంబు వానికే మూటఁ గట్టితివి

పుట్టి లేదని యెప్పు డుగ్గమ్ముఁ గాంచి
పెంచ లేదని యెప్పు డెద్దనిఁ జూచి
యిల్లిల్లుఁ దనదని యేల యెప్పుడవు!
ఇహమెల్లఁ దనదని యేల యెప్పుడవు!
ఇదియె సత్యంబని యేల యెప్పుడవు!
ఇదియె నిత్యంబని యేల యెప్పుడవు!
తనశక్తిఁ గానక తలఁపుట గాక
తనముక్తిఁ గానక తలపోఁత గాక
యిహలోక సామ్రాజ్య మెడచిన వేళ
పరలోక యాత్రకై పరుగిడు వేళ
సత్యమై తన వెంట జాడరాఁ గలదె?
నిత్యమై తనయందు నీవెంటఁ బడునె?
జీవుఁడా నీలోనఁ జిక్కుకొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

* *

చిమ్మచీకటిలోనఁ జిక్కిన నీకు
మిణుఁగురు పురువేమి మేలుచేకూర్చు?
పొలిమేటిలోఁ బడిపోయిన నీకు
శీర్ణతృణంబేమి సేమంబుఁ గూర్చు?
కార్చిచ్చులోఁ బడికందిన నీకుఁ
బల్వాలం బేపాటి భద్రంబుఁ గూర్చు?

సుడిగాడ్పులోఁ బడి స్రుక్కిన నీకుఁ
దిరిగెడి యాకేమి తెకువఁ గూర్చు?
జ్ఞానసాధనల కంజలి జలం బిచ్చి
మాయా ప్రకృతిఁ జిక్కి మమతలోఁ జొక్కి
సంసారమెల్ల నైజంబైన దనుచుఁ
బామరత్వంబునఁ బ్రాకు లాడెదవు
పరమాత్మవయ్యు నుపాధి భేదమున
వగచు చున్నావు జీవభ్రాంతి నిట్లు
జీవుఁడా! నీలోనఁ జిక్కు కొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

* *

త్రావియుఁ దన తృష్ణ తఱుఁగని యప్పు
డమృతవిభ్రాంతి లోనందంగ నేల?
పలికియుఁ దనమది పట్టని యపుడు
సత్యకల్పభ్రాంతిఁ జరియింప నేల?
ఎఱిఁగియుఁ దన మోహ మెడలని యపుడు
సుప్రబోధభ్రాంతిఁ జూడంగ నేల?
కలసియు నైక్యంబుఁ గాంచని యపుడు
మోక్షవిభ్రాంతిలో మునుఁగంగ నేల?
అది యమరత్వమొ - యది బ్రహ్మ పదమొ
అది జ్ఞాననిలయమే - యది ముక్తి తెరువె?

భువనముల్ శాసించు భూపాలకోత్తముల్
ప్రకృతిరాగంబుల జ్ఞాని మునులు
తా నెవ్వరికిఁ గాక, తన కేమి గాక
వసియించు తనకు విశ్వభ్రాంతి యేల!
జీవుఁడా! నీకేల చిక్కు కొన్నది!
దేవుఁడా యనిపించు పేరిది యున్నది!

*                    *

అణువు బ్రహ్మాండమై యలముకొన్నవుడు
అణువులో బ్రహ్మాండ మడఁగి యున్నవుడు
అణువుగా నీవుంచు నది నిజం బైన
సంతట నీవుండుననుట సత్యంబె?
చిన్నకుఁ జిన్నవై పెంపొంది నావు
పెద్దకుఁ బెద్దవై పేరుఁ గన్నావు
మానాభిమానాల మఱుఁగని నాఁడు
కష్టసుఖంబులఁ గలఁగని నాఁడు
వెలుఁగు చీకటులకు వెఱవని నాఁడు
జీవవిశ్వభ్రాంతిఁ జెందని నాఁడు
తగులంబు నీ కేల తాటోటు గాని
మోహంబు నీ కేల మోమోట గాని
ప్రకృతిఁ బాలింపఁగాఁ బలికితి వేమొ?
మాయ నేలింపఁగా మఱచితి వేమొ?

జీవుఁడా! "నీలోనఁ జిక్కఁ గొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

* *

జ్ఞానభాస్కరకిరణ ప్రసారమున
మోహనీహారంబు ముగ్జాల ముడిపి
సత్యబోధానంద చంద్రోదయమున
మాయాంధకారంబు మాయంగఁ జేసి
ఆత్మతత్త్వానుభవాధార నౌక
సంసార గంభీర జలనిధి దాఁటి
అన్యదుర్లభపరమార్థమై యొప్పు
నిత్యసత్యబ్రహ్మనిలయమై యొప్పు
నీపూర్ణానంద నిలయంబుఁ జొచ్చి
ధ్యానయోగారూఢ తత్త్వంబుఁ గాంచి
పరునకుఁ బరుఁడవై బ్రహ్మానుభూమి
విజ్ఞాన మూర్తివై వెలుఁగుదు గాక!
ఏకైకమూర్తివై యెసఁగుదు గాక!
ఘనయోగముద్రలోఁ గను మోడ్తు గాక!
జీవుఁడా! నీలోనఁ జిక్కఁ గొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

# ఛా యా మూ ర్తి వి లా స ము

ప్రకృతి పురుష స్వభావప్రాకాశనమున
ఛాయయేమూర్తి మూర్తియేఛాయ యనుచుఁ
దెలుపు మలుపులఁ దేల్చి సంధించి పలుకు
నాదకర్తల కెంపు నాపండనములుః

*　　　　*

మూర్తి:

కను విప్పి చూడఁగంటిని
మనస్సైనది కదలి మొదలి మాటాడంగ
నను మేలుకొలిపి రెవ్వరు!
ఘనమోహగాఢనిద్రఁ గాంచినవానిన్.

ఒంటినై యుందు నెఱుఁగుదు, నొసలు వచ్చి
పలుకలేరని యెఱుఁగుదుఁ, బిలుచుచుంటిఁ
గూడి మసలంగవలెనని కోరుచుంటిఁ
బలుకరే! రారె! యెవరున్న భ్రాంతి గాక!

ఛాయ:

ఓయని పలుకుదు నిదె నీ
ఛాయను, నామూర్తి! భ్రాంతి చనునయ్య ననున్
నీయాజ్ఞావర్తిని, నీ
ప్రేయసి, నీపాదదాసిఁ, బ్రీతిం గనుమా!

మూర్తి:

ఛాయా! ప్రేయసి! చెప్పుమా!
నాయెడ లటు జల్లుమనఁగ నాకోర్కులతో
నాయుల్ల ముల్లసిల్లఁగ
సాయపడినయట్టి మంత్రసానివి నీవా!
గర్భనరకమో స్వర్గమో కాని యెఱుఁగ,
అంధకారమో తేజమో యది యెఱుంగ,
ఉద్ధృతాజ్ఞానమో జ్ఞానమో యెఱుంగ,
చెప్పలేని యవస్థఁ గాంచితిని నాఁడు.
మాయామయగోళంబునఁ
'గాయము ఘనరాశి బిందుకళలో డిందన్
వాయెఱుఁగనిగతి నుండితి
ఛాయా యానాఁటి కెందు చనితివి చెప్పుమా!

ఛాయ:

లీలామూర్తివి నాకుఁ
జాలిం బడ నేల? క్రొత్తసంసారమె! నీ
కేలిం బాములువడఁగా
నేలా? యది మనవిలాస మెఱుఁగవె మూర్తీ!

మూర్తి:

నిండు వెలుఁగునఁ జూచితి నీవు లేవు,
నిండుచీఁకటిఁ గాంచితి నీవు లేవు,

వెలుఁగు చీఁకటిసందుల కొసకొసంగ
నాఁడు నాఛాయ! నిన్నుఁ గానంగనైతి.

ఛాయ:

నిండువెలుఁగు దలంపఁగా నీవు గావె
నిండుచీఁకటి గణియింప నేను గానె
వెలుఁగుచీఁకటి మధ్యమైనవిధమునఁ దెలిసి
నాఁడు నామూర్తి! వేఱ కానంగ నేల?

మూర్తి:

నిన్ను వేఱుసేసి నే నిల్వఁగంచునే
ఆకులతకు మూలమదియె కాదె,
భ్రాంతిలతకు ద్వంద్వఫలసిద్ధి యది కాదె
అనియె నీదులీల యగును గాదె.

ఛాయ:

లేదు పాపపుణ్యంబులలీల నాకు
లేదు సుఖదుఃఖపరిణామలీల నాకు
లేదు కీర్త్యపకీర్తులలీల నాకు
నీయడుగులీల యొక్కటె నియతి నాకు.

మూర్తి:

నాకెగ్గొడునీడఁగా నడయాడుదువు గాని
యేకోరికయుఁగూడ నీకు లేదు,
నే జేయుపనుల నన్నిటఁ గూడుదువు గాని
యేకర్మమునుగూడ నీకు లేదు,

నాయున్న తీకొలంది నాకఁ బంటుమ గాని
యే కొలయునుగూడ నీకు లేదు,
నే బడలి పరుండ పైఁ బట్టుదువు గాని
యేకష్టమునుగూడ నీకు లేదు
నిజము నాచాయ! యేదియు నీకు లేదు,
లోకమున లేని దేదియు నాకు లేదు,
అన్ని యున్నవి నీ వున్న యపుడె నాకు,
కలది యేదియు లేదు నాకంటె నీకు.

ఛాయః
ఆదర్శమూర్తి! నాకుఁ
నీదీవన యేటికొత్త, నిత్యాశ్రయమన
మ్మోద మనాదిగ నిచ్చిన
నాదైవమ వీవు గావునఁ సేవింతున్.

మూర్తిః
మున్నాడి మెనవనొల్లవు
నన్నెడసి, యొకప్పుడేని నాపానుపుపై
వెన్నొంపవు మున్నుగ నా
కన్న సతీరత్న మీవు గావే ఛాయా!

ఛాయః
నిత్య పురుషమూర్తీ! నినుఁ
బత్యనురూపమునఁ బడసి బ్రహ్మాండముగా
సత్యాఖ్యఁ బొందగంటిని
సత్యమునకుఁ జాయ నైతి సౌభాగ్యమునన్.

మూర్తి:

సుమమున సౌరభమట్టులు
క్రమమున నాలోన నిండి, కొలవవనవి
భ్రమమున వెనుకను ముందును
సమయ మెఱిఁగి సంచరించుచతురన్న ఛాయా!

ఛాయ:

నీలో నుండుదుఁ గానీ
నాలో నీ వుంటివే! సనాతన సమ్మున్
గాలానువృత్తిఁ బెట్టిన
బాలుఁడవు నీవు గావె శాశ్వతమూర్తీ!

మూర్తి:

నా కన్నదాన వయ్యుచు,
నాకన్నులపాప వయ్యు, నాయసుగులనే
మైకొన్న ఛాయ వయ్యును
నాకు సనాతన వదెట్లు నమ్ముదుఁ జాయా!

ఛాయ:

సకలలోకావనారంభమూర్తివి నీవు
నీ యొంటియద్దంపుఁజాయ నేను,
విశ్వసమ్మోహన విష్ణుమూర్తివి నీవు
నీయెడఁ గల సిరిఛాయ నేను

అక్షరాగమ చతురాస్యమూర్తివి నీవు
నీయొప్పిదపుఁ బలుకుఁజాయ నేను,
భవ్యతేజోమయ భానుమూర్తివి నీవు
నీయడుగులఁ బట్టు చాయ నేను,
మూలరూప పరబ్రహ్మమూర్తి వీవు,
మూలహేతుమాయానంతమూర్తి నేను,
నను సనాతనఁ, బ్రకృతి, ననంత లీల
నీశ! నీయనంతచ్ఛాయ నేలికొనుము.

మూర్తి:

కంటిలోఁ బాపవు గావె నాచాయ!
వెర వేది నిన్నింక వేఱుసేయంగ;

ఛాయ:

ఇంటిలో దీపంబ వీవె నామూర్తి!
వీ లేది నిన్నింక వీడి యుండంగ;

మూర్తి:

కష్టప్రపంచంబు గడచన్న దాఁక
నాతోడ నుండుమా నాచాయ నీవు;

ఛాయ:

సృష్టికి విశ్రాంతి చేకూరుదాఁక
నను వీడఁబోకుమా నామూర్తి నీవు;

మూర్తి:
అద్భుతానంద భాగ్యము కల్గునాకు
సతముఁ గొల్చుచుందుమా నాథాయ సత్య!
ఛాయ:
అమర బ్రహ్మానంద మబ్బినాఁక
నాకేవ లందునా నామూర్తి సత్య!
ఛాయ: ఓ జగద్విధాతా!
మూర్తి: ఓ జగద్రూపిణీ!
ఛాయ: వందనము.
మూర్తి: శుభాభినందనములు.
ఛాయ: ఓ యనంతమూర్తీ!
మూర్తి: ఓ యనంతచ్ఛాయా!
ఛాయ: నిత్యజయము నీకు.
మూర్తి: నిత్యశుభము.

---

## జీ వా మృ త ము

జ్ఞాన మక్షరసౌఖ్య నిధాన మగుట
ఆ నిధాన మానంద నిదాన మగుట
అదియె విశ్వజీవామృత మగుటఁ దెలిసి
అనుభవింతు నా యమృతరసాయనంబు!

ఆది యున్న దటంచు నభిమాన ముంతునా
యేమూల యేత్రోవ యెఱుఁగ వచ్చు?
అంత మున్న దటంచు నంగీకరింతునా
యేచోట కేనాఁటి కేఁగ వచ్చు?
మధ్య మున్న దటంచు మనసుంచుకొందునా
యీ మొండితనమున కేమి వచ్చు?
ఆదిమధ్యాంతశూన్యత నిజం బందునా
నా యునికి నేమని నమ్మ వచ్చు?

తుది మొదలు లేని శంకలతోఁ బనేమి?
నేను లేదనుకొను తెల్వి నిల్చు నాఁడె
నేను జీవుఁడ ననుభ్రాంతి మాను నాఁడె
అన్నియును దీఱుఁ బరమాత్మ నైన నాఁడె.

భావానందస్ఫూర్తిన్
సేవానందానురూప చిన్మయ మూర్తిన్
భావింతును సేవింతును
జీవానందామృతంబు సిద్ధించుటకై.

అది సారము సౌఖ్యంబున,
కది గుఱి సాధనకుఁ, దృష్ణ కది తృప్తి, పదం
బది యంతరంగ లీలకు
నదియే యానంద మమృత మని సేవింతున్.

ఆనందమని, విజ్ఞా
నానందమని, శక్తి ప్రజ్ఞానానంద మని, ప్రే
మానందమని, నిత్య ప్ర
సన్నానందమనిఁ గొల్తు సమధి నామృతమూర్తిఁ.

విశ్వకోశ పత్రంబుల విప్పి విప్పి
వెలుపలను లోపలను గూడ వెదకి వెదకి
సిద్ధసారామృత రసంబు జీవనము
నాని యూగి నే దానిలో మేను మఱతు.

సాగరగంభీర జలతరంగము లందు
శ్యామలాఘన నీలమేఘంబు లందు,
సుఘుమున హారి మందపవనాంచలము లందు
నవనవోంతి కూజనము లందు,
నిర్మలనిర్ఝరిణీ నినాదము లందు
ఘనశైలకందర స్వనము లందు,
మణిమయవల్లకీ మంజునాదము లందు
శిశుగణావ్యక్త భాషితము లందు,

ప్రణయమిథునానురాగ భాషణము లందు
విశ్వవిజ్ఞాన సంగీత విమల కళల
నాద బిందు చిదానంద నవ్య కళల
ఆలకించుచు నుందుఁ గర్ణామృతముగ.

జగిసాంపుఁ గూర్చు కెంజిగురుటాకుల లోన
సమదకోకిల కూజితముల లోనఁ,
దావిమోవులు విచ్చు పూవుగుత్తుల లోన
భ్రమరఝుంకార నాదముల లోన,
నెలపూఁతనించు నీరెండ సంజల లోన
వరగోకులాంభా రవముల లోనఁ,
జలువలందించు క్రొన్నెల వెన్నెలల లోనఁ
బ్రమద చకోర నృత్తముల లోనఁ,

గన్నులార జీవకల్యాణ కర మైన
జ్ఞానదానమూర్తిఁ గాన రండు
వీనులార సకల విశ్వసారం బైన
జ్ఞాన గాన రసము నాన రండు.

నాదంబోంకారముగా
వేదం బీ విశ్వరూప విజ్ఞానముగా
నాటము రసభావముగా
నాదియు నంతంబుఁ గలిపి యామోదింతుఁగా.

తలఁపు లోనఁ బెంచు తాఁబేటిఁ గనుఁ గొందు,
చూపులోనఁ బెంచు చేపఁ గం:దు,
పొదిగి సంతుఁ బెంచు పులుఁగును దీఁకింతు,
త్రిగుణ సృష్టిఁ గాంతుఁ ద్రికరణముల.

చందురు చూడఁ గనుఁ గొందురుగా
చందురు నందున్న కళను చూచి గాదందురుగా
చందురు కల తెలిపందున్
చందు పరబ్రహ్మ, కందు జగ మని కందురుగా.

చందు మనం బొక్కటియె యగా
నందున కల తెల్పి జ్ఞానమందున నిత్యా
నందం బందున యమృతం
బందున బ్రహ్మానుభూతి యందున నెంచికొన్.

గిరిరాజా! భవదీయ భూరిగుణ
దాక్షిణ్యంబె ప్రాణ్యంబు, నా
గరరాజా! భవదీయ సారగుణ సాం
గత్యంబె నిత్యంబు, కం
ధరరాజా! భవదీయ దానగుణ స
న్మానంబె జ్ఞానంబు నాఁ
బరమాత్మానుభవామృతంబు రుచియింపం
గంటి మీ సత్కృపగా.

రాతిరియున్ బవల్ దరప్పు
రాని మహోన్నతినంది, గోత్రసం
జాతగురుప్రశస్తిఁ గని,
సంయమమూర్తినిఁ గాంచి, వాత్రీ

ఆతపబాధలం గన వ
హార్యవరేణ్య! తలంప నీవె కా
దాతవు నేతవున్ స్థితివి
ధాతవు మా కవిరాజహంసవున్.

చుట్టిన చీకటిం దెరలఁ
జూచి, కరంబులు సాచి తూరుపుం
గట్టినఁ దోఁచిలోకములఁ
గాంచు ప్రభాకరు లీల నెమ్మదిం
జుట్టిన మోహపుం దెరలఁ
జట్టలు సుట్టి దహించి, తత్త్వపుం
గట్టున జ్ఞానభాస్కరతఁ
గైకొని కాంచెద నాత్మలోకముల్.
'ఓయవజ్ఞత! నా త్రోవకోసరిల్లు,
దూరమేఁగుము తృష్ణ! నీ దారిగాదు,
దురభిమానమా! యిది నీవుత్రొక్క రాదు,
నిష్ఠురత! రాకు నీకిందు నీడ లేదు.

సంసార విప్లవంబులు
సంసారావర్తభయదఝంఝానిలముల్
సంసారఘోరసాగర
హింసావృత్తములు పొందవిఁక నన్నెందున్

తన కింత విశ్వసౌందర్యానుభవ మేల
తన యక్షిగోళ చిత్రమునఁ గాక!
తన కింత విశ్వగీతసుఖానుభవ మేల
తన కర్ణరంధ్రయంత్రమునఁ గాక!
తన కింత విశ్వామృత సుఖానుభవ మేల
తన రసనాగ్ర పాత్రమునఁ గాక!
తనకింత విశ్వగంధసుఖానుభవ మేల
తన ఘ్రాణ మూల సూత్రమునఁ గాక!

తనకు నింతటి విశ్వతాత్పర్య మేల
తన మనోభ్రాంతిరూపసూత్రమునఁ గాక!
తనకు మన నేల! ప్రకృతితంత్రమునఁ గాక!
ప్రకృతి తన కేల! యాత్మ కర్మమునఁ గాక!

నెలఁ ద్రొక్కకుండ వెన్నెల చిక్కకుండఁ గ్రొం
జలువ లానెడి నెలపులుఁగు లీల
పువు గందకుండఁ బుప్పొడి చిందకుండఁ గ్రొం
దేనె లానెడి యెలదేఁటి లీల,
మబ్బెక్కకుండ గుమ్మలు గ్రుక్కకుండఁ గ్రొం
జినుకు లానెడి వానచిలుక లీల,
మది నోవకుండ నెమ్మది వోవకుండఁ గ్రొం
జనవులానెడి సాధుజనుని లీల,

ప్రకృతిఁ బాలించి, ప్రణయ స్వభావ మెంచి,
పరము నాలించి, తత్త్వ ప్రభావ ముంచి,
ఆరగింతు నానందరసాయనంబు,
అనుభవింతు సుజ్ఞాన సిద్ధామృతంబు.

నిర్లక్ష్యవిశ్వసాధన
నిర్లిప్త నివృత్తనియతినే జ్ఞానసుధా
వార్లహారి నానఁ గంటిని
దుర్లభయోగానుభూతి దొరకొనఁ గంటిన్

జ్ఞానార్ణవమునఁ ద్రిప్పెడు
నా నౌకను, దివ్యలక్ష్యనక్షత్రకళా
ధీన మగు యోగపథమున
నానందామృత పదంబు నందుట కొఱకున్.

విషయ చింత లడఁచి విమల మార్గముఁ గంటి,
శోక మడఁచి సుఖము చూఱఁ గొంటి,
జీవచింత లడఁచి సిద్ధామృతముఁ గొంటి,
ప్రకృతి నడఁచి బ్రహ్మపదవిఁ గంటి.

నే నెవ్వఁడ ననుకొనఁగా
నే నా జీవుఁడను గాను నిజ మనుకొనఁగా
నేనే లేదనుకొనఁగా
నానందబ్రహ్మమైతి నమృతం బైతిన్.

పసరు పొత్తిళ్లలోఁ బన్నుండి మొగ్గనై
మూఁక తెమ్మెరలలో రేకు లెత్తి,
పూవుఁ బిప్పరములోఁ బూదేనె సోననై
వలపుఁ గాలువలలో వఱద వెట్టి,
జీవ యుయ్యాలలోఁ దేలిపోఁగ కంపునై
సంసార వాటిలో సౌరుఁ బంచి,
సందాకు గిండిలో ఫలరసాయనమునై
ప్రజ్ఞాననిధులలోఁ బాఱఁ బోసి,
కేవలాన్య ప్రకృతి సహాంకృతులు నేర్చి,
ఇహ మెఱుఁగ నేర్చి, పరము సాధింప నేర్చి,
నిత్యసత్య సుఖానంద నియతి నేర్చి
విమల తత్త్వామృతంబు సేవింపఁ గంటి.

---

## ప్రేమ సాక్షాత్కారము

ప్రార్థనంబు గాదు పరిదేవనము గాదు
ప్రస్తుతియును గాదు ప్రణతి గాదు
ఆసలెల్ల విడిచి యాత్మార్పణము సేయు
నోమొకంటె చాలుఁ బ్రేమ నిధికి.

ఏపుణ్యమహిమచే నీనాఁటి పూజలో
విరిసెనల్ వలపులు విరివి నవియొ?

ఏ భాగ్యగరిమచే నీనాఁటి విందులో
మూడిదల్ క్రొంజవ్వుల్ చూపి నవియో?
ఏ శుభప్రాప్తిచే నీనాఁటి సేవలోఁ
జేతలుఁ జిత్తంబుఁ జేరి నవియో?
ఏ యోగ సిద్ధిచే నీనాఁటి పాటలోఁ
బలుకులు తలఁపులఁ దెలిపి నవియో?
ఏమి నాయదృష్ట మీనాఁటి కీవేళ
నా తపఃఫలంబు చేతి కందె
నా భవంబు వెలసె నా ప్రాణ నాథుని
సుప్రసన్నమూర్తిఁ జూడఁ గంటి.

చూపులఁ గనులాడి సోన లోడుచె కాని
కడకాలి గోరైనఁ గాంచితి వఁటె
పిలుపుల గొంతెండి బీఁట వాఱుచె కాని
హో యను పలుకైన నందితి వఁటె
తలఁపుల నెదగ్రుంగి తల్లడిల్లుచె కాని
తలవాకిటికి నైన దరిసితి వఁటె
ఆనల నునురాఁగి యటమటిల్లుచె కాని
పదరజఃకణమైనఁ బడసితి వఁటె
అనుచు నెచ్చెలు లాడిపోసిన దినములు
జరగి దుస్స్వప్నములఁ బోలి సురిఁగి పోవఁ
దనకుఁ దావచ్చు శుభముహూర్తంబుఁ బోలి
స్వామి నా ప్రేమాల నేఁడు సాక్షాత్కరించె.

కోకిలా! నీ వింక కూసిన నేమి నా
దైవతధ్యానంబు దప్పె నింక
మయూరా! నీ వెంత మైకొన్న నేమి నా
స్థిరతరచిత్తంబు చెదర దింక
వెన్నెలా! నీ వెంత విరిసిన నేమి నా
వరరత్నసౌధంబు గనఁగ దింక
నవ్వలీ! నీ వెంత నెట్టిన నేమి నా
సత్యవిశ్వాసంబు సడల దింక
భాగ్యవశమున నేఁటి కెన్నఁటికి నేను
బ్రాణవిభు నింటి దాసనై, ప్రభుని చెలి
చెలువనై, న్యాయపూజాదిచేటు దొఱసినైతి
నింక నెవరెట్టులున్న నా కేమి భయమో?

తన నాహారముఁ జేసి తట్టిన యంతనే
దయచేసి మెల్లగాఁ దలుపు దెఱచె
నవిరళాశ్రులఁ గన్నుఁ గవఁ దేల్చి నంతనే
నదమలాకృతి నెట్ట యెదుట నిలిచెఁ
బ్రియము మీఱఁగఁ బల్కరించిన యంతనే
మనము జల్లనిపించు మాట లాడెఁ
దమి దీర సేవింపఁ దలపోసి నంతనే
వర వైభవంబెల్ల వశము సేసెఁ

# రో గా క్షపం

శ్రీలకు సత్య, వర్ణకళా
శ్రీలకుఁ గృతి, త్యాగ యోగ సిద్ధానుభవ
శ్రీలకు సుజ్ఞానస్థితి;
మూలముగా గొన్న తత్త్వమూర్తుల దలతున్.

కవి :

ఆశ్చర్య మాశ్చర్య మదె పట్టపగటనే
కనఁబడె మింట బంగారు చుక్క,

చూడఁగాఁ జూడఁగాఁ జుక్కగాఁ గోఁచదు,

భూమికి దిగు చందమామ యేమొ!

చందమామా యది? చూచినా యిట్టిగా

నగవడు చున్నది దిగిన కొలఁది!

శుద్ధ సువర్ణప్రశోభితమైన తను

రంగము వలె విచిత్రముగఁ గాని

వచ్చుచున్నది, యిది వేల్పు వాహనంబొ!

ప్రొద్దుదొర తేరి సప్తాశ్వముల నొకండు

బెదరి యిట్లేఁగుదెంచు చున్నదియొ యేమొ!

విభ్రమాద్భుతగతుల నెందు విందు సేయు.

జాతి సువర్ణ సంచయము
చక్కని యచ్చునఁ బోసినట్లుగా
నే తలఁతుఁగా సుమావ మట
నిల్చిన వాల్గన వచ్చు, భారతీ
జాతి హారంబు గాని పెఱ
జాతిది గాదని తోఁచు చుండె, నీ
భూతల మందు దీని సరి
పోల్పఁగఁ జాలిన యన్యమున్న దే!

దీని వెనుక నొక్క మానిత తేజంబు
గూఢ ముండె, రహస్యంబో యేమొ!
దివ్యమూర్తి నిందుఁ దిలకింపఁగాఁ గంటి
నొందఁ గంటిఁ గన్ను లున్న ఫలము.

భోగినై యుండునా! వక్రమూర్తి గాదు,
రాగినై యుండునా! వికారంబు లేదు,
యోగినై యుండునా! మేని యొప్పు వోదు,
తెలియ నెవ్వరై యుండు నీ దివ్యమూర్తి?
ఱెప్ప వేయవు నను జూచు టిచ్ఛ నేమొ!
చరణ మూఁపవు నేల నాచార మేమొ!
నిన్నుఁ గని యల వేల్పుగా నేఁ దలంతు
శుభగమూర్తీ! వచింపు నీ చొప్పదేమొ!

మూర్తి :

ఎదిరి నెఱిఁగి పలుకు టెంతయు లెస్స, కా
దేని యూరకుంటయే నయంబు!
త్రోవఁ గంటఁ బడిన దొడ్డవాఁడవు, మంచి
యవు గదన్న! చెప్పు మెవఁడ వన్న?

కవి :

ఎవఁడనో నన్ను నేనె వెల
యించుకోనం జన దైనఁ జెప్పు వా
రెవరును లేని నాఁడు వచి
యించుట దోసము గాదు, ధాత్రిపైఁ
గవి నయి కొన్ని నాళులు సు
ఖస్థితిఁ గాంచిన వాఁడనౌట, నా
ర్యవర! ననుం గృపాపరత
నక్షె వచింతువు; తెల్పు నీకతన్.

మూర్తి :

విద్యాధరులకు బంధుఁడ,
విద్యాధికులై యెసంగు విబుధుల కెల్లన్
సద్యోత్థభృత్యుఁడఁ, బెద్దలు
విద్యార్థి యటండ్రు నన్ను, విబుధవరేణ్యా!

నలువకు శిష్యుఁడన్, గమిం
నాథుని దాసుఁడ, రాజశేఖ రా
మలపదచింతనా రతుఁడ,
మన్ననమై విబుధేంద్రు దూతనై
యిలమిఁ జరించువాఁడ నిటు
లీ సవనాశ్వము వెంటనంటి, ధీ
బలులను రాజయోగులగు
పార్థివచంద్రులఁ గాంచు వేడుకన్.

కవి :

విన వలతు దేవదూతా!
యనఘం బగు సవన మెచట నగు? దానికి నే
ఘనమూర్తి యజ్వ యగు? దా
న నగు ఫలముఁ గ్రతువు పేరు నాకుఁ దెలుపవే!

దేవదూత :

ఆంధ్రవీరభూమి నది నెఱవేఱును,
అమలకీర్తి యజ్వ యాంధ్రమూర్తి
యోగతూగ మిది, నియోగించి సురరాజు
యాగహయము వెంట నంపె నన్ను

వింటివిగా కవీంద్ర! పృ
థ్విం గల చంద్రుని పేరు మున్ను భా
మింట వెలుంగు చంద్రునకు
మేలుగఁ బత్నికృతోత్సవ మొప్పి, య
న్నింటనుమున్న గావెడలి
నిర్మలకీర్తులసర్వదిక్కులన్
గొంటి, నరేంద్రుఁ జూడదివి
కిం జనియుండిన యట్టి వార్తలన్.

కవి :

వింటివె కాదా చంద్రుని,
గంటి నతని కరనిదానఘనదానసుధన్
మంటి నననేల కవివే
రంటిన వారెల్ల బ్రదుకరా తత్కరుణన్

అభినవాంధ్రకర్ణుఁ డతఁడు దానంబున,
నభినవాంధ్రభోజుఁ డతఁడు విద్య,
నభినవాంధ్రకృష్ణుఁ డతఁడు ప్రాభవమునఁ
జంద్ర నాముఁ డతఁడు సాంద్రకీర్తి.

ప్రాంచదాంధ్రప్రచారిణీ గ్రంథ నిలయ
సుస్థిరస్థాపకుండు భాసురయశుండు
మాతృభాషాభిమాని యస్మత్ప్రియుండు
తన్న వాఁడఁటె! యట సుఖ మున్న వాఁడె!

లలితసద్గుణ గుణాలంకృతుం డగు వాఁడు
కమనీయతర కీర్తిఁ గన్న వాఁడు,
సంతతానందప్రశాంత చిత్తము వాఁడు
ధర్మానురూప వర్తనము వాఁడు,
నిత్యసత్యవ్రత నియతిఁ గాంచిన వాఁడు
హితమితమధుర భాషితము వాఁడు,
ప్రవిమలోదార స్వభావంబు గల వాఁడు
భవ్యసౌభాగ్య వైభవము వాఁడు
దీనజనముల మొఱ వినలేని వాఁడు
లేని వారల వెతఁ జూడ లేని వాఁడు
సర్వజన రంజనము సేయఁ జాలు వాఁడు
ఉన్న వాఁడటె! యట సుఖ మున్న వాఁడె!

ఆంధ్రదేశప్రభుత్వాప్తి యశఃకీర్తు
లందిన దాతని యన్వయంబు,
బసివిరెడ్డి యనంగఁ బ్రథితాత్ముఁ డగు భూరి
విభవాఢ్యుఁ డాతని పెద్ద తండ్రి,
దైవతాలయ పురస్థాపకుఁ డైన చి
న్నయరెడ్డి యాతని యనుఁగుఁ దండ్రి,
శ్రీసతీప్రతిభాఢ్య చిన బుచ్చమాంబిక
కడుపు చల్లఁగ వానిఁ గన్నతల్లి,

యింకేమి కోర్కెలు నెరవేఱమి నెవ్వ
స్వర్గసామ్రాజ్యమందైన నిత్య క్రీడ నంది
యేఁగె నానాఁడు బృందారకేంద్ర పురికి
నున్న వాఁడఁటె! యట సుఖ మున్న వాఁడె?

దేవదూత :

ఉన్నాఁ డమరేంద్రుని పురి
నున్నాఁ డాతం డమరేంద్రుఁ డొక్కఁ డనఁగా
నున్నాఁడు నిత్యసుఖమై
యున్నాఁ డానంద నందనోత్సుక లీల

హరిహరహిరణ్యగర్భుల
పురవరముల కరిగి వారిఁ బూజించి, నిరం
తర గురుబోధల మెలఁగును,
సరసాంబ్రప్రియుఁ డతండు నాక పురమున

అమరగురుని యొద్ద నాత్మ తత్త్వంబును
నిర్జరేంద్రు నొద్ద నిగ్రహంబు
శచికుమారు నొద్ద సౌహార్ద భావంబు
తెలిసి మెచ్చి కలసి తిరుగు నతఁడు.

స్వర్గ మందుండి మఱవఁడా జన్మభూమి
మధువు నాలించి మఱవఁడు మాతృభాష
దివిజకవిఁ జూచి మఱవఁడు తెలుఁగు కవులఁ
దెలియ దా మహనీయుని దీక్ష యేమొ!

తన భాషాసంతానముఁ
దన భాషాకామరూపదైవతసురభిన్
దన భాషా చింతామణి
ననయముఁ దలపోయుఁ డా సురాలయుఁ డయ్యెన్.

కవి :

అమృతకరసురేంద్రుఁ డతని వీక్షామృత
మంద కుండఁ బోయినట్టి నాఁడె
యాంధ్రనిలయ నందనారామమున కేమొ
యాకురాలు గాలమయ్యె నకట!

పుల్ల విరిగి యెండి పోయె సంతానంబు
కామధేను వేమొ గాజువాఱె
బొగ్గుదేఱి కగ్గిపోయెఁ జింతామణి
చేతి గాలి కా విశేష మేమొ!

దేవదూత :

ఇఁకమీఁద నిది విను మెల్ల సంశయములు
దీఱుఁ గష్టంబులు తీఱిపోవు,
నొక నాఁడు త్రిదశేంద్రు నొద్దకు భగవానుఁ
డైన శుక్రుఁడు వచ్చి యభిమతార్థ
సంభాషణంబుల జరపి యాతని పూజ
లంది క్రమ్మఱి పురి కరుగు నాఁడు,

గురుసర్థి దర్శించి సరసగోష్ఠి మెలంగి
యా ప్రక్కనున్న మహానుభావుఁ
జంద్రుఁ గని వాని వృత్తాంత మింద్ర గురుని
వలన సర్వంబు నెఱిఁగి దివ్యప్రభావుఁ
డతనిఁ గృపఁ జూచి యోచించి యాక్షణంబ
యాగహాయ మొండుఁ బుట్టించి యనియె నిట్లు.

అభిమతము తీఱు వత్స! గుర్వానుమతిని
యోగ యాగంబు సేయుమీ యాగహాయము
మాతృదేశంబు దిరిగి సమ్మతము మీఱఁ
జేరు నిను; నిది కల్యాణసిద్ధిఁ గూర్చు.

అని యాగహాయముఁ దోకొని
యనిమిష గురుతోడఁ జంద్రు నమరాధిపు నొ
ద్ద నునిచి భార్గవుఁ డతనికి
వినిపించి శుభమనిపించి వెండియు ననియెన్.

శుభముహూర్త మయ్యె సురగురువరునాజ్ఞ
మంత్రసిద్ధి యయ్యె మామకాజ్ఞ
అర్థసిద్ధి యయ్యె నమరాధిపుని యాజ్ఞ
యాగహాయము విడువు మయ్య వత్స!

అనుచుఁ జంద్రు చేత నామోదకరముగా
వినుత యాగహాయము విడువఁ జేసి

వెనుక నన్నుఁ జూచి విద్యార్థి రమ్మని
యఖిలవేది శుక్రుఁ డనియె నిట్లు.

రావయ్యా! విద్యార్థివి,
పోవయ్యా! హయము వెంట పుణ్యాత్మునకం
దీవయ్యా! సత్కీర్తులఁ
దేవయ్యా! విజయసిద్ధిఁ ద్రిదశేంద్రునకున్.

అచ్చు పరంబై చెల్లుచు,
హెచ్చు న వర్ణముల నెసఁగి యేఁబది యాఱై
వచ్చిన పదములఁ దిరుగుచు,
వచ్చు హయము సుకవు లెల్ల వర్ణింపంగాఁ.

ఇది మార్గ మాంధ్రమునకని
యిది భారతపద మటంచు నిది వర్ణకళా
స్పద మగు పదమగు నంచును
విదితము గావించు యోగ విద్యాశ్వంబే.
చను మని కావ్యుఁడు పలుకఁగఁ
జను నని గురుఁ డానతీయ సద్యస్సుపర్వాల్
ఘనమని నుతింప నింద్రుని
యనుమతిఁ జంద్రుని ప్రియంబు నంది వెడలితిఁగా.
కవి :
హయము సమస్తదేశముల
యందుఁ జరించునుగాక, యోగవి

ద్యయు నతి యోగవిద్యయు స్వ
ధర్మపథంబునఁ గాంచి ధీరులై
నయవిమలై శుభార్థులయి
సవ్యసనాతన రీతు లెంచి, యా
హాయమును జూచి పట్టఁగల
యట్టి మహాత్ములు లెవ్వ రుండిరే!
విక్రమార్కుఁ డున్న వెలుఁగులఁ గనఁ గాక!
భోజుఁ డున్నఁ దెలిసి పొల్పుఁ గాక!
కృష్ణరాయఁ డున్నఁ గేరి పస్తును గాక!
వారు నేఁడు చూడ లేరు గాక!

నన్నియచోడరాజు నల
నన్నయ యేలిక రాజరాజుఁ, ది
క్కన్నను మెచ్చుకొన్న మను
మావనిపాలుని శంభుదాసు నె
ఱ్ఱన్నను గొన్న వేమవసు
ధాధిపచంద్రునిఁ జేమకూర వెం
కన్నను బ్రోచికొన్న నృపు
నా రఘునాథునిఁ గాన నేర్తుమే?
దేవమాత:
వారు మహానుభావులు ధ్రు
వప్రతిమూర్తులు, వారలెల్లరుఁ

భారతి యింటఁ బద్మభవు
పలుకులఁ బాటల రాజహంసలై
గౌరి గృహంబునఁ శివుని
కైతల రీతుల జ్ఞానమూర్తులై
సారతరాత్మసత్త్వగుణ
సంపదఁ జేరి రనంతధామమున్.

వారు లేరు గాక! వననిధివేష్టిత
భూవలయము వట్టి పోయె నయ్యొ?
చిక్కకుండుఁ గాక! చింతామణులు మఱి
జీవ మణులు లేవె క్షీర వార్థి?

ఏ పుట్టనేమి యుండునో
చూపట్టునఁటయ్య మనము శోధింపక, ము
న్నొక పుట్టఁ బుట్టి యొక ముని
దీపింపఁడె రామచరితఁ దెలిపి సుకీర్తిన్

తినఁ బోవుచు రుచు లేలా?
యనఘా! యోగాంత మందె యది కనుఁ గొనఁగా
నను వగుఁ గాదా; చనవలె
వినవలసిన దొండు వినుము వేడుక యేనిన్

సవనహయ శ్రీముఖమున
వివరించిన యోగయాగవిషయార్థము లీ

సతాకోపించి నిలువును

ధర్మాంగదునకు సంకెలలు వేయించును

కవి:

అనలేమున్నది గన్నా
మనకలు వాటినగీ, మాన్పు మాటిన దిది నా
జెనఁగల యమపాశంబో,
మనలెడి గుఱ్ఱంబుగూడ గాయంబయ్యెన్

దేవమాత:

మఱచి చేయవుగదా మాతృవిద్రోహంబు
చేసినపాపంబు చెప్ప మన్న!
మించి చేయవుగదా మిత్రవిద్రోహంబు
లోడరిన కీడేమొ నుడువు మన్న!
సలిపియుండవుగదా స్వామివిద్రోహంబు
తెలిసినదోసంబు తెలుపమన్న!
ఆచరింపవుగదా యాత్మవిద్రోహంబు
కలిగిన వాదేమొ పలుకు మన్న!

లేక యుండినఁ గను గానరాక యున్నె!
కాక యుండినఁ జూపులు గప్పుకొన్నె!
అట్టివే కానిచో దృష్టు లాఁకఁ గన్నె!
అది జరుగకున్నఁ బొర లేటికొదవు నన్న!

చేసినది యనుభవింపక
పోసి చనునఁటయ్య! ముందుమా టుంచుమునేఁ
బోసెద నమృతం బిదిగో!
గాసి విడిచి, కన్నుఁ దుడిచి, కనుఁగొను మన్నా!
కవి:
చేసిన్న తప్పులు పెక్కులు
త్రోసితివి కృపాంతరంగ! తొలఁచితి కన్నుల్
భాసురహాయముఖపద్య
వ్యాసంబును గంటి, విందువా పఠియింతున్.
"గురుఁడు:
యోగాశ్వ మాత్మవిద్యా
యాగాశ్వము, సర్వమంగళాధారగుణా
భోగాశ్వము, చంద్రకృత
త్యాగాశ్వము దానవీరదర్పాశ్వం బే!—"
"శుక్రుఁడు:
భోగులురారు దుష్కలుష
పూరితదేహులు వారు, ప్రాభవా
వేగులు రారు నిశ్చలవి
వేకవిహీనులు వారు, సద్గుణ
త్యాగులు రారు కామనవి
దారితచిత్తులు వారు, బ్రహ్మవి

స్వర్గంలో రాజమహేంద్ర
లో [illegible]

“మహేంద్రుడు:

దివ్యయోగభాగధేయ మీ యశ్వంబు
దివ్యభోగభాగధేయు డైన
రాజయోగు లున్న రాజ్యము కోరవచ్చుఁ
బరమయోగు లున్నఁ బట్టవచ్చు”

“స్వస్తి:

“శ్రీముఖము, నక్షరాకృతి, సిద్ధపదయు
సుగతియు, సువృత్తయును, శుభలక్షణయును
భావవేగయుఁ బరమార్థభరితగుణ నగు
హాయినను యమమూస నోసఁగుఁ గల్యాణపదము.”

---

## నేను

అక్షరమ! నీ పదంబున నైక్య మగుదు
పదమ! నీ యర్థసంపదఁ బ్రస్తరించు
అర్థమా! నీ ప్రభావంబు నధిగమింతు
ఆద్యుఁడనొ? కవినో? లోక హరయుఁగాక!

*     *

గురుపదధ్యానమే నాకు గుబ్బగొడుగు
ఆత్మభావరక్షణమె నా కంగబలము
ప్రకృతిపోషణమే నాకుఁ బరమధర్మ
మధిపుఁడనొ? కవినో? లోక మరయుఁగాక!

*　　　　*

నా మనోరథ గతికి మాంద్యంబు లేదు
నా ప్రకాశవిస్తృతికి హ్రాస్వంబు లేదు
నా ప్రబోధాకృతికి దుర్దినంబు లేదు
ఇనుఁడనో? కవినో? లోక మెఱుఁగుఁ గాక!

*　　　　*

తమము విరియింతు, నాశలఁ దళుకు లుంతు,
కలఁక వెడలింతు లలితసత్కళల నింతు,
దోషము లడంతుఁ గువలయ తోష మెంతు
నిందుఁడనొ? కవినో? లోక మెఱుఁగుఁ గాక!

*　　　　*

పలుకులా సత్యవాక్య సంభావనములు
తలఁపులా నిత్యధర్మ సందర్శనములు
చేఁతలా కృత్యభిమత సంజీవనములు
అజుఁడనో? కవినో? లోక మరయుఁ గాక!

## శ్రీ ము ఖ ము

శ్రీముఖమా! విశేషములు?
  స్థితిఁ గంజూడవా?
యంతమాత్రానే శ్రీముఖ మైతివా!
  కృతులు సెప్పుము
  చేతలా?
తొంటి పెద్దలే నీముఖం జెక్కి నారు
  మఱి నీ వెటు తప్పుదు?
కాలకంఠమున్ బాములు తప్పునే?
ప్రకృతిబాధ మహాత్ములు నైన కుందరే?

---

## వ సం త శ్రీ ము ఖ ము

పట్టు దప్పిన జీర్ణపత్రంబు లూడ్చి
పల్లవించెడు వనస్పతులను జూచి
పొగమంచు ముసుఁగు దూబాములఁ ద్రోచి
నెఱనిగ్గు నించు వెన్నెలనీటఁ బోచి
కట్టి గొంతుబిగించు కాలంబుఁ గడపి
గాన మాలాపించు కలకంఠిఁ జూచి
నవన భ్రాజ్జ్వలత రానంద తేజమున
విలసిల్లి కళదేఱు విశ్వంబుఁ జూచి

మరల నార్యా ర్తమంగళాస్థాని
శాంతిసౌభాగ్య మ్ల్ సవరింపఁ జూచి
ఘనవసంతశ్రీ సుఖము తీసఁ జూచి
సాధనంబును జూచి సమయంబుఁ జూచి
మడమ ద్రిప్పక స్వధర్మపథంబుఁ బట్టి
నడువుఁడీ! కవఁగూడి నా యన్నలార!

౨

కొలఁది గొప్పతనాలు కొఱకొఱ పెట్టఁ
బదవుల యదవద భ్రమసిపోయితిరి
బొట్టులు, జుట్లు, తప్పలు కుప్ప పెట్ట
నంటుముట్టుల గోల నదరి పోయితిరి
లోపెలివాడలు లోపాలు రేప
వెలివిడు గడలకో విసిఁగి పోయితిరి
సౌభ్రాత్ర సౌహార్ద సహనముల్ దొలఁగ
నన్యోన్యవైరాల నలసి పోయితిరి
నిలిచిన స్వర్గంబు నిరయంబుఁ జేసి
పడరాని పాటుల బడలి పోయితిరి
చేసిన పాపాలు చెప్పుచు నోట
నిఁకనైన నన్యోన్య హితమతులగుచు
మడమ ద్రిప్పక స్వధర్మపథంబుఁ బట్టి
నడువుఁడీ కవఁగూడి నా యన్నలార!

3

పరమార్థనిధి యైన భారతభూమి
వైనసం గొఱగాక పాడగుచుండ
పరముక్తి పదము నైన భారతభూమి
పలుగాకి మూకల పాలగుచుండ
పరమపావన మైన భారతభూమి
పాపతాపంబుల భారమౌచుండ
పరమధామం బైన భారతభూమి
బానిసతనములోఁ బడి క్రుంగుచుండ
సత్యదయాధర్మశాంతివిధికల
దీనభారతమాతఁ దేలింపకుండ
నార్యసంతతివార మనుకొను మనము
కనుమూసి కాలంబు గడపుట తగునె?
మడమ ద్రిప్పక స్వధర్మపథంబుఁ బట్టి
నడువుఁడీ కవగూడి నాయన్నలార!

## వసంతాంత శ్రీముఖము

కమ్మతావిఁ గడల గమ్మగ మ్మనిపించి
తేనెపానకములఁ దేంట్లఁ దనిపి,
సత్ఫలోప్రకృతికి సర్వస్వమర్పింప
నలరులెల్ల సిద్ధమగుచు నుండె.
చివురుల నవకంబు చెదరుచున్న కొలందిఁ
గోకిలకంఠంబు గొణఁగఁ దొడగెఁ,
విరిదేనెఁ బుప్పొడి పొరమించిన కొలందిఁ
దేఁటి నాలుక బీటదేఱఁ దొడఁగె,
కరుపళ్ళు పడమరఁ దిరుగుచున్న కొలంది
నెలసీళ్ళు నులివెచ్చ మలయఁ దొడఁగె,
పట్టుగొమ్మల దొరపం ట్లూడిన కొలందిఁ
బేదతీగల గొంతు బిగియఁ దొడఁగె
ఇనుఁడు రోహిణివగలఁ బెల్లగయు కొలఁది
భువనగర్భాంతరాళంబు పొగయఁ దొడఁగె
శశి విశాఖాంతరస్థుఁడై జరుగు కొలఁది
మధువనోపవనశ్రీలు మాయఁ దొడఁగె
ఆఁకలి దీరఁగాఁ జిగురు
టాకులు మేయుచు నేఁడె మోహన
శ్రీకల పంచమశ్రుతుల
చే జగమెల్ల సుధామధుద్రవా

నరముల నాకలోకభవ
సౌఖ్యము లందితి రెల్లకాలము
స్వైర నొకరీతి సాగ దుప
వాసము సేయుఁడు గాని వేపలం
దిరిసి కులంబుగౌరవము
తేలిక చేయకుఁ డమ్మ కీరముల్!
నడకబడలి, యాఁకలిమంట నుడికి చిలుక
కొట్టని తినంగఫలముఁ గైకొంటి గాని
పాంథుఁడా! సంశయం బయ్యెఁ బట్టి త్రిప్పి
చూచుకొను మోయి! త్రాచు మూచూచెనేమొ.
నిన్న నిలిచెన నేఁటిలో నిండకుండఁ?
పగలు మిగిలెనె రాత్రిలోఁ బడకయుండఁ?
అట్లె యీ వసంతము గ్రీష్మమైన దాఁకఁ
గూరుచుండుదు మన కిది క్రొత్తగాదు.

---

## వర్షాశ్రీముఖము

ఒరులసుఖదుఃఖయోగవియోగములకు
సాధకము బాధకం బయ్యు సమతఁ గనుచు
నిత్యనూత్నసనాతననియతి నెగడు
ప్రకృతిపరిణామ వితతికిఁ బ్రణతిశతము.

పైరులు పెరుఁగనీ పల్లెలు ముఱుఁగనీ
నిండి పాఱకపోవు నిర్ఝరిణులు
దారుణగ్రీష్మసంతాపదగ్ధభూత
ధాత్రి జీవామృతమ్మునఁ దనియఁ జేసి
యగణితశరద్విభూతిభీతడఁపకుండ
నరుగునే నభ మొదలి వర్షాగమంబు.

౬

ఎప్పుడు సమయంబగునో
యప్పుడె వర్షోపలబ్ధియగుఁ గాక పురుల్
విప్పిన కేకుల కేకలు
కప్పల బెకబెకలు మలఁపఁ గలవె ఋతువులన్.

౭

ఉఱిమియుఱిమి పిడుగు లురలించు మఘుమించి
మబ్బు లుబ్బరింపఁ బుబ్బ రేఁగి
చిలికిచిలికి కురియఁ జెలరేఁగి తెరువాఁగు
కోడె నాగులాగు కొండనాగు.

౮

కడలఁ గ్రక్కదలించి కలగాలి వడఁదూలి
గిరికాననములఁ జిందరలు సేయ
కన్నుమిన్నను మూసి కాఱుమబ్బులు గ్రమ్మి
చిమ్మచీఁకటులు విశ్వమ్మునింప

౧౧

ననుఁగాంచి పెక్కరించిన మల్లికావల్లి
పల్లవంబులు ముందుపాటుఁ దలఁచి,
నన్ని నడించిన నవమాలతీగంధ
కళికలు రానున్న గతులు దలఁచి,
నేనున్న వనవాటికైనఁ గన్గొలుపని
తేఁటు లాగామి దుర్దినముఁ దలఁచి,
నా తావు లరయుర యాతావులని జొక్కు-
తెమ్మెరల భావి దుస్థితులు దలఁచి
కలిమి లేములు కాలసంగతము లనుచు
నెరచనే దుర్దినంబె చూపించె నంచుఁ
బ్రాప్తకాలంబుదాఁక నూఱడి తపంబు
దీర్చి ఫలసిద్ధి గాంచె నీతి గల జాతి.

౧౨

మునుపు దుర్భిక్షవేళఁ గైకొనిన విందు
మాట మధుమదభ్రమరంబు మఱచుఁ గాక
మరలఁ దటిఁజూచి దరిఁజేరు మధుపమునకుఁ
బ్రీతినే కూర్చు నుత్తమజాతి జాతి!

# అప్రమాలి

జీవమణిమూల్య సిద్ధాంతులార!
నిఖిలప్రసవమూల్య నిర్ణేతలార!
అశ్రుబిందువుమూల్య మది యెంత గలదో
గణియించి గణియించి కనిపెట్టగలరో?
కలికికస్తురినిండఁ గైసేయవిచ్చి
వెలఁది యొడలంటపై విశ్రాంతి యిచ్చి
యారాధనముకై యాసనం బిచ్చి
యనుఁగుఁజాబ్బలలోఁ నాశ్రయం బిచ్చి
మఱచిపోదనె యట్టి మ[illegible]మాల!
మఱచిపోదనె యట్టి మాణిక్యమాల!
మఱచిపోదనె యట్టి మల్లికామాల!
మఱచిపోదనె యట్టి మహితాశ్రుమాల!
మూల్యంబునకు నేని, ముచ్చట కేని,
చేయకట్టునకు నేని, యొరవుగ నేని,
యితరుల కెన్నఁడు నీరానిదాని,
యనిమిషులకునైన నందని దాని,
శోకామృతాబ్ధిలోఁ జూచిన దాని,
విరహామృతాబ్ధిలో విలిచిన దానిఁ,
ప్రణయామృతాబ్ధిలోఁ బడసిన దాని
మఱచిపోదనె యట్టి మహితాశ్రుమాల!

మనసులోఁ దన కెంత మర్త్యత్వ మున్నఁ
దలఁపులోఁ దన కెంత దైవత్వ మున్న
సత్యైకభావామృతాబ్ధినే పుట్టి
సువ్యక్తమై యది చూపులఁ దోఁచి
కంటితారల నిల్చి కరగించుచుండఁ
గన్నులఁ జిత్రముల్ గల్పించుచుండఁ
గనుఱెప్పఁ గోవయై కాన్పించుచుండ
మఱచిపోదునె యట్టి మహితాశ్రుమాల!
మలినమైయున్న నామానసంబునకుఁ
బరిశుద్ధిఁ జేకూర్చి భద్రంబుఁ గూర్చి
సంశుద్ధబింబ ప్రసన్న రూపమునఁ
గమనీయమాలికగాఁ గానవచ్చి
కోరిక చుక్కల కోవలువిచ్చి
కోమలకాంతుల గుణము లందించి
నాకంటితోడ మంతనమాడుదాని
మఱచిపోదునె యట్టి మహితాశ్రుమాల!
అది హృదయాకాశ హైమతారకము,
అది భావసంధానితాశ్వాససురభి,
అది యంతరంగచిత్రాంశుబింబంబు,
అది మానససుధార్ణవాంతరహంస,
అది పాంచభౌతికంబైన చిత్రంబు,
అది ప్రేమరాజ్యరహస్యసూత్రంబు,

ఆమె పుష్పమాలికల్కి, నాటి సన్నుతుల్కి,
మఱచిపోదునె యెట్టి మహితాశ్రమాల!
గ్రహాచార వాదము కంఠోక్తిగాఁగ
సమటి యత్నమాల నూతేఁచు లక్ష్యము;
సదాచారవాదము చతురోక్తిగాఁగ
నయనాశ్రువుల జన్మశతంబు లబ్ధము;
నిత్యప్రణయతత్త్వనియతిఁ బోనాడి
యెవ్వ రేగతి గణియించ నాకేమి!
యూహ కందినదాఁక యుగములదాఁక
మఱచిపోదునె యెట్టి మహితాశ్రమాల!

---

## ప్రే మ గా య కుఁ డు

౧

మాన్యుఁడగు రామచరిత రామాయణముగ
మానవతిసీతచరిత రామాయణముగ
మానవప్రేమచరిత రామాయణముగ
మాని వెలయించెఁ దన ప్రేమగానమందు.

౨

సీతపూతచరిత్ర ప్రసిద్ధమయ్యెఁ
గుశలవసురూపవిభవంబు విశదమయ్యె

జానకీపతి మది సుప్రసన్న మయ్యె
మానిరత్న దివ్యప్రేమగాన మంము.

3

లలితసుకలాభ్యుదయమూర్తి లవుని యందు
కుశలమంత్రాభ్యుదయమూర్తి కుశుని యందు
చిరపవిత్రాభ్యుదయమూర్తి సీత యందు
మాని వెలయించెఁ దన ప్రేమగాన మందు.

౪

ఇతఁడె-ఆప్రేమగాయకుఁడు-ఇతఁడె యితఁడు
యీతఁడే యితండని పంచభూతములును
దశదిశ లనంతభువనముల్ నిశలుఁ బవలు
పాడి చెప్పుచు నున్న వినాఁడు-నేఁడు.

## శ్రీబాబా రామమోహన స్తుతి

నిత్యానందచంద్రికా శోభను జూచియా
నీ దివ్యతేజంబు నేఁడు గూడ
శీతలామృతకరుణాస్రోతముల సేవింతుము మా
నీ కృపారసవృష్టి నేఁడు గూడ
వరవిహంగకలారవముల గ్రోలుచును జూచియా
నీ సుధామధురోక్తి నేఁడు గూడ
సచరాచరప్రపంచమును చూచుచును జూచియా
నీ శాంతమయమూర్తి నేఁడుగూడ
నేఁడు నీరూపు మాకు నాఁటేఁడు లైన
నెదుట గలయట్టులే తోఁచు నెల్లవేళ
సమర్థమైనది నీదు దివ్యప్రభావ
మహనీయుఁడవు నీవు రామమోహన మహాత్మ!
నీవు నాటిన మొక్క సఖిలార్థసిద్ధమై
యమృతకల్పకవల్లి ననుకరించె
నీవు పాడినపాట నిరుపమానందమై
ప్రణవవీణాతంత్రిఁ బ్రతిరవించె
నీవు పట్టిన జ్యోతి నిశ్చలాభోగమై
పరమతేజంబునఁ బ్రస్ఫురించె
నీవు తీర్చిన బాట నిష్కంటకంబయి
యాగమాంతపథంబు నధిగమించె

సమరమైనది నీ పావనావతార
మమరమైనది నీ ప్రణయప్రవృత్తి
సమరమైనది నీ నిశ్చయాత్మబోధ
మమరుఁడవు నీవు రామమోహన! మహాత్మ!
సరసఫలాభిశోభిత ర
సాల మొకప్పటికైన నెండికా
వ్వృఱు నవరత్నహేమఖను
లంతట నిండు మహాద్రి కాలగ
హ్వారమునఁ గూలుఁ గాని నిర
వద్యభవద్విమలప్రబోధసా
గర మటు గాక తన్పుఁ గల
కాలము లోకము రామమోహనా!

---

## భా వ కీ ర్త న ము

జీవుఁడు దేవుఁడుఁగా సకల
చిత్తవికారవికల్పనంబులున్
నీవయి, యర్థసత్త్వములు
నీవయి, వేదకయున్ స్వభావముఁగా
నీవయి, చేష్టయుం గ్రియయు
నీవయి, భావనయుఁగా విభూతియుఁగా
నీవయి, భావవత్సరమ!
నింపుము మా "కఖిలార్థసంపదల్",

## గ్రీష్మము

కో[illegible] మే[illegible] గ[illegible]
గ్రుచ్చుఁగ కాలము, పెక బయళ్ళపై
రాకలు పోకలుం బగలు
రాఁజు కాలము, పృచ్ఛ రాయకే
లోకువపెట్టు కాల మది
లోఁగిళు లూపస్త్రలాఁగు కాల, మా
కాకులు గూండ్లు కట్టుకోను
కాలము దాపురమయ్యె నేఁడునన్.
నీరయిపోయె దీర్ఘికల
నిండిననీరు, క్రమక్రమంబుగా
నేటి లెడారు లయ్యె, వడ
నింకిన నూతులఁ జేదు త్రాళ్ళకున్
మూరలు బారలయ్యె నెల
ముంజెకరస్త్లళనీళ్ళై జీవనా
ధారము లయ్యె నిర్జలప
థమ్ముల నెండల మండువేసవిన్.
ఆ కటీమ్ముల యనుదిన గండమ్ము
రాచబాటల యంటరాని తెగులు
పద్మాకరముల తాపజ్వర వేదన
పసిపూపపిండెల విపపుఁగోర

కడలు చూపఁగరాని కడల కన్నుల దుమ్ము
పచ్చపచ్చిక బీళ్ళ మచ్చచూపు
వనలింటిపూటల బలిమినమ్మోటప్రేటు
నిదుర చాలని రేల నెత్తికోత
బోడికొండల చెకుముకి పూలకారు
బడుగుపనివారల యొడళ్ళ బందకారు
పాలబొలపాపల యాకురాలు కారు
విశ్వభీకర మగుచుండె వెట్టకారు.

పొదను జంతువైనఁ బుట్టలోఁ బామైనఁ
గలుగులోన నెండ్రకాయ యైన
బురదఁ బంది యైన సరసిని మీనైన
వేఁగె నొక్కలాగె వేసఁగి బడి.

గాలి గరళ మయ్యె గనులు కుంపటు లయ్యె
నలరుఁదోఁట లగ్గిచెలమ లయ్యెఁ
దాఫ మడఁచు నీరె దావానలం బయ్యెఁ
గలదె జనుల కింక నిలువ నీడ.

అమరులకు హవిస్సు లందించు నిత్యక్రి
యాచారు లగు నాహితాగ్నులకును
అతిథిసత్తములకు నాత్మీయులకు వంట
కములఁ గూరుచు కులకాంతలకును
దినవెచ్చము గడించుకొనఁ బాలుపడి కొల్మి
కడఁ బాటుపడు లోహకారకులకు

పాలి పోసిన సరసి గర్భముల లోనఁ
గసులి వాడిన దిగ్వితానముల లోనఁ
గాలి సోలిన జీవసంఘముల లోన
మాఱు మొఱసిన దాస్యపంచమస్వరంబు.
మిడియెండలు, వడగాడ్పులు
సుడిదుమ్ములుఁ గారుచిచ్చు చుఱచుఱలు నిగం
బుడికింపఁగ హాహారవ
పుపరఁ దోడఁగె నంతకంత కగ్గల ముగమగ్.
ఆరవ ఘంటటం బెరసి
హైందవసంఘకృతాపరాధ సా
షారవమై యధఃకృతజ
నాభిభవప్రతిఘాతివీరనుం
'గారవమై నిరంతరము
హాత్మని వేదితసత్యధర్మగీ
తారవమై లయించెమహీ
తప్రణవారవమం దనంతమై

జ్ఞానఖని వయ్యుఁ బ్రాకృత జనునిఁ బోలి
యేల విపరీతకార్యంబు లిట్లు చేసి
తభవ! యిదినీకు సహజమో యనుకరణమొ
నిజ మెఱింగించి నన్ను మన్నింపుమయ్య!
బొమ్మకపాల మేమిటికి
భోజన పాత్రగఁ జేసి కొంటివో
యెమ్ముల నేల నేమిటికి
నిష్టగృహమ్ముగఁ జూచికొంటివో
నెమ్మదిలేక యేమిటికి
నిత్యతపంబును జేయుచుంటివో
నమ్మతిఁ దెల్పి నా మది వి
చారముఁ బాపవె విశ్వనాయకా!
నెలవంక దరిమించు తలవంక నృపతి పా
ల్పసి భాగీరథిఁ జేసినావు
సోమును దాల్చిన పతి యజ్ఞవాటి పా
ల్పసి యుపార్యజఁ జేసినావు
తన్ను మించిన యాత్మతనియుని సురల పా
ల్పసి సేనానినిఁ జేసినావు
భక్తి నర్చించు నబ్బలిఁ ద్రివిక్రముని పా
ల్పసి విశ్వత్యాగిఁ జేసినావు
పరులు తనవారనెడి భేదభావ మేది
యింత యభిమానశూన్యుండ వేటి కైతి

శంకర! నీ చేయు కార్యంబు లెఱుఁగ నెవరు!
నీకు నీవె సమానవు సత్యమయుఁడ!
హిమవంతునకు రత్న హేమభాగ్య మిచ్చి
వెనుక పాముల మెడఁ బూనినావు
అలకాధినాథున కైశ్వర్య మొసఁగి
జోగివై భిక్షల కేఁగినావు
వారిదంబునకున్న యంబరం బిచ్చి
గజచర్మమును గటిఁ గట్టినావు
విబుధుల కమృతంబు విందు సేయఁగ నిచ్చి
హాలాహలంబును గ్రోలినావు
భోగివో! విరాగివో! నిన్నుఁ బోల్ప రాదు
త్యాగివో! వియోగివో! నిన్నుఁ దలఁప రాదు
నీ చరిత లవాఙ్మానస గోచరములు
విశ్వకల్యాణగుణగణ విభవ! భవ!
కల్లరిగావు, కర్మఫల
కాంక్షలు లేవు స్వయంభువుండవై
తల్లియుఁ దండ్రివై, విభవ
దక్షుఁడవై, జగమేలుకోక నీ
యెల్లధనంబు లిట్లొసఁగు
టీశ్వర! నీకు వినోదమాత్రమై
చెల్లె నటించి నిన్ గొలువఁ
జెల్లవె జీవుల కర్మబంధముల్

ప్రభుఁడవు నీవు నే భజియించుకొను టెట్లు
లబ్ధమానసుండ నైన దాఁక
గుణవిహీనుఁడవు నిన్ను గణుతించుకొను టెట్లు
నేను నీయంతవాఁ డైన దాఁక
అణువును గావు ని న్నర్చించుకొను టెట్లు
లంతట నేనుండు నంత దాఁక
రూపంబుఁ గనవు నీ దాఁపుఁ జేరుట యెట్లు
నేను నీవొక్కటి యైన దాఁక

వాదు సేయ నాతోడ నీవల్లఁ గాదు
చెలిమి సేయ నీతోడ నాచేతఁ గాదు
శ్రుతుల వినఁబట్టు మాటలే చూచి యిట్లు
లన్వయించు కొన్నాఁడ భవానుభవము.

---

## ఆంధ్రభూమి

౧

కన్ను విప్పనినాఁడు గాచి ప్రోచితివి,
మే నెఱుంగనినాఁడు మేలుకొల్పితివి,
పదము తొట్రిలునాఁడు పట్టి నిల్పితివి,
నే నెఱుంగనఁటమ్మ! నిన్నాంధ్రభూమి!

[illegible]
[illegible]
[illegible]
న న్నెఱుంగవటమ్మ! నాయాంధ్రభూమి!
సంపన్నిధివి నాకు, శక్తివి నాకు,
నిఖిలకీర్తి నాకు, విద్యవు నాకు,
సౌఖ్యమూర్తి నాకు, జననివి నాకు,
నే నెఱుంగనటమ్మ! నిన్నాంధ్రభూమి!
తెలివిఁ దెచ్చిననాఁడె దీవించి నన్ను
నా మనోరథము[illegible] ప్రేమఁ జేకొంటివి,
ప్రాపసాయంబులు పదున[illegible]
న న్నెఱుంగవటమ్మ! నాయాంధ్రభూమి!
గృహదేవతగ నిన్నుఁ గీర్తింపఁ గంటిఁ,
కులదేవతగ నిన్నుఁ గొలువంగఁ గంటి,
మాతృదేవతగ నిన్ మన్నింపఁ గంటి,
నే నెఱుంగనటమ్మ! నిన్నాంధ్రభూమి!
అంతరంగము పత్త్ర, మాత్మ పుష్పంబు
భవము ఫలం, బనుభవము తోయంబు
అనుపమానందాప్తి నర్పింతు నిన్ను
న న్నెఱుంగవటమ్మ! నాయాంధ్రభూమి!

౩

వీరమూర్తుల శస్త్రధారల లాలించిన
యస్త్రాలఁ దేలిన దాంధ్రభూమి
కవిలెకట్టలఁ గత్తిగంటాలు నింపిన
యమృతంబుఁ గ్రోలిన దాంధ్రభూమి
బహుళ ప్రకృతుల సౌభ్రాత్ర మర్పించిన
యలరుల నలరిన దాంధ్రభూమి
అర్థకామముల ధర్మాకృతుల్ మెఱసిన
యణువులఁ బొదలిన దాంధ్రభూమి
పరహితార్థ మెలమిఁ బ్రాణముల్ విడిచిన
యాపణములఁ గన్న దాంధ్రభూమి
ప్రతి పదార్థమందుఁ బరమార్థసారంబు
నంది పుచ్చుకొన్న దాంధ్రభూమి.

---

## ఏ మం దు ?

ఏమందు
నాకోస మెందుకీ ముసుఁగు?
ఈముందు
గని వెన్క కెందుకీ విసుఁగు?
పుట్టినప్పుడు లేని ముస్తాబు లేల?
పోవునప్పుడు రాని పొలుపు లింకేల?
నడుమ నాకోసంబు నటనంబు లేల?
కొలఁదిగొప్పలఁ గూర్చు గొడవ లింకేల?

ఏమందు—

# పంచమాభినందనము

పంచమ నామ వేద మయి
భారత ముత్తమమై పొసంగఁగాఁ
బంచమ సుస్వరం బది ప్ర
పంచమనోహరమై యొసంగఁగాఁ
బంచమ నామమూర్తి యతి,
పావన దేవతయై సెలంగఁగాఁ
బంచముఁ డీ నికృష్టుఁడని
పల్కుట వంచన గాదె చూడఁగాఁ
తన దేశమాతను దనియింప నొల్లని
మలినాత్ముఁ డొక పెద్దమాల గాక
తనజాతి కెఱఁగియుఁ దప్పంగ నాడిన
లోలాత్ముఁ డొక పెద్దమాల గాక
తంబాన మన్నింప కనురోధ మొనరించు
మదచిత్తుఁ డొక పెద్దమాల గాక
జనసహోదరవృద్ధిఁ దలఁపక యెదురాడు
మతకరి యొక పెద్దమాల గాక
మమతఁ దప్పిన యాతఁడు మాల గాక
మాటఁ దప్పిన యాతఁడు మాల గాక
అన్నిమును బున్న మెఱుఁగని యట్టిమాల
మాలయే! దేవుమెడఁ బూలమాల గాక!

గోడీ వస్త్రములుగాఁ జూచెనాఁ గూడినా
సయ్యాటపు బింబుల వేడ్కలేమి?
నెలి మాన్పి తీసిన బుద్ధులు చెప్పఁ గూడినా
చతురాగ మోసదేశముల కేమి?
మనసులోఁ బాదుకొనియున్న మాలతనము
మూల విచ్ఛేదముగఁ జేయఁ జాలు దాఁక
సత్యభారతజాతికి శాంతి లేదు
ధీరమతులార! సంఘసంస్కారులార!

వేడుక కొకసారి విందిచ్చి నంతనే
యంటరాని తనంబు గెంటఁబడునె
హాస్యాని కొకసారి యన్న యన్నంతనే
మైలమాలతనంబు మాయ మగునె
నురియాద కొకసారి దరి జేర్చినంతనే
చేరరానితనంబు దూరమగునె.

ముచ్చట కొకసారి ముట్టుకొన్నంతనే
చెప్పరానితనంబు తప్పి చనునె
మనసులోఁ బాదుకొనియున్న మాలతనము
మూల విచ్ఛేదముగఁ జేయఁ జాలుదాఁక
సత్యభారతజాతికి శాంతి లేదు
ధీరమతులార! సంఘసంస్కారులార!

సడలించి చనురుంది మానుచు కొందుముగాని
చెడగొరిగింతురే చిక్కుకురులు?

తడిసి ముక్కుచు నున్న ధన్యకేదారంబు
పసిమొలకలకె జీవశక్తిఁ గూర్చుఁ
దునిసి యెండుచు నున్న ఘనతరస్కంధంబు
చిలుగొమ్మలకె జీవకళలఁ గూర్చు
నుడిసి వాడుచున్న సురభిళకుసుమంబు
పసరుపిందెకె జీవరసముఁ గూర్చుఁ,
ఒగిలి చిచ్చుచు నున్నఁ బరిపక్వసుఫలంబు
పరువుగింజకె జీవపటిమఁ గూర్చు,
నాత్మసుఖము చన్న నైశ్వర్య మెడఁగన్న
నిడుమ లెదురుకొన్న నీల్గుచున్న
స్వార్థపరత లేక సంతతి కుసుర్లు
ధారవోయునమ్మ తల్లివీవు!
కులశీలమహాత్త్వంబులు
గలతల్లుల నిన్నుఁ బోలఁ గలవా రెందుం
గలరే, పిచ్చేఁ గాంతా
కులమే సుతిఁ గన్న దమ్మ! కుంతీదేవీ!
బాన పేరిట నాలిపల్కు దాఁటఁగ లేక
కొడుకును వనికంపె నొడయఁ డొకఁడు
ధర్మము పేరిటఁ దగుఁ దగ దనబోక
సంతతి వండించె శైవ్యుఁ డొకఁడు
లేమి పేరిటఁ బొట్ట నోముకో గతిలేక
పాపనిఁ దెగనమ్మె బాపఁ డొకఁడు

చేసి లొల్కుచుఁ బల్కు చిన్నవల్లికి వోలె
మదిగూర్పఁ జాలునే మద్దళంబు!
తళుకువాఱుచుఁ దేరు లలితకౌముది వోలె
తెలివీయఁజాలునే వెలుఁగుబులుఁగు
ఎంత కలిమియున్న నెంత గౌరవమున్న
ఎంత పలుకుమిసిమి యెంతయున్న
ప్రజల మనుపఁ బెనుపఁ బాలింప లాలింపఁ
గన్నతల్లి బోలఁ గలఁడె తండ్రి!

---

## సంజీవనము

(నాంది)

పరముఁడవు నీవు శుచివీవు ప్రభుఁడవీవు
అజ్జుఁడవీవు హరివీవు, హరుఁడవీవు
ధన్యుఁడవు నీవు లోకబాంధవుఁడవీవు
అధిప! నీకృప లోకకల్యాణకరము!

ఆంజనేయుఁడు :

(సంజీవికై పోవుచు సమయభంగ శంకచే సూర్య భగవాను నుద్దేశించి)

ఇనకులతిలకునిభక్తుఁడ,
దినానాథతనూజసచివతిలకుఁడ, లోకా
వనపవమాన తనూజుఁడ,
ఘనదీప్తిసహస్రకిరణ! కరుణింపుమనున్!

వానోటిని యమృతకళా
క్షీనముగాఁ జేసి తెంతక్షమఁడవా ప్రభూ!
చనవిచ్చితి, చదివించితి,
వనయము వెనువెంటఁ దిరుగ నానతియిడి నీ
వనలిచ్చితి, వాదరమున,
మనవిచ్చితి వాత్మవంశమునకు కొలువునకు
నావిభుఁడగు శ్రీరఘురా
మావనివిభునాజ్ఞ లక్ష్మణానమునకై
పోవలయును సంజీవినిఁ
దేవలయును దేవ! కరుణఁ దేర్పుమునన్నుఁ గా!
ఖలుఁడు కాలనేమిగాఁడు పుకారియుఁ
బోలె వచ్చి తప్పుబోధ చేసి
తప్పుదారిఁ బెట్టి తజియెల్లఁ జెడఁగొట్టఁ
దలఁచి తాసె పాపఫలముఁ గనియె.
కానీ దేవా! కాలము
న్యూనంబగుఁ గాదె నీ యనుగ్రహమిడగా
నే నర్థించెద నిన్నభి
మానంబునకై త్రిలోకమంగళమునకై
శ్రీరామచంద్రధాత్రీనాథ శేఖర
సత్ప్రయత్నమునకు జయముఁగోరి
సంతతజపతపస్స్వాధ్యాయసంపన్న
సాధులోకమునకు శాంతిఁ గోరి

కంచెయే చేను మేయఁగా నెంచి నపుడు
చూచు వారింక నెవరయ్య! సూర్యదేవ!

జాంబవంతుఁడు :

(రాముని విభ్రాంతినిఁ దొలఁగింప నుద్దేశించి)

ఆత్మచింతనమున నఖిలంబు మఱచిన
యప్పుడు నెఱుక నిలుప నగును గాని
పరమపూరుషునకు భ్రాంతులు తగునయ్య
రవికులాబ్ధిచంద్ర! రాఘవేంద్ర!
అఖిలకల్యాణదివ్యప్రభుండే కాక
ప్రభుఁడు నీ సద్గోత్రవిభవమునకు
త్రిగుణత్రికాలోపదేశకుండే కాక
దేశికుండు భవద్విధేయ భటున
కురుధర్మమయదండధరగురుండే కాక
గురుఁడు తావక సుహృద్వర విభునకు
సదోభ్ధిదీక్షాజగద్బంధుఁడే కాక
బంధుండు నీకు నీ భ్రాతృమణికి
ఆదినారాయణునకు నీ కార్తిఁ గూర్పు
నఖిలపించు నె సూర్యనారాయణుండు!
సంశయము వీడు పావని జూడఁ జాడు
మోహవనిప్రభ లవి గాని యొందు గావు.

సుగ్రీవుఁడు :

(అత్యాశాభ్యుదయమును భాగ్యోదయమును గాంచి యానందముతో)

సాధుసేవ ఫలించె సంజీవము లభించె
జీవలోకం బెల్లఁ జేతరించె
కమల పూజఫలించెఁ గన్నులు వికసించెఁ
గమలజాండం బెల్లఁ గందళించె
విరుల నోముఫలించెఁ జిఱునవ్వు దులకించె
భువనమండల మెల్లఁ బులకరించె
ప్లవగస్తుతి ఫలించెఁ బలుకు ధ్వనియించెఁ
బ్రణయజగం బెల్లఁ బల్లవించె
మిత్రభాగ్యోదయమున సౌమిత్రి నేఁడు
గురుకటాక్షంబుతో మేలుకొన్న వాఁడు
ఈ ప్రభాతంబు జగతికి సుప్రభాత
మీ దినం బెంతో సుదినంబు గాదె మనకు.

రాముఁడు :

(సుషేణజాంబవదాదుల నభినందించుచు)

పలుకింత నీనోట వెలువడ్డదో లేదొ
ఘనుఁ డంతలోనె తత్ప్రక్రియకుఁ బూనె
సుఖమార్గ మీవింత సూచించితో లేదొ

భావించి యితఁ డిట్టి పయన మయ్యో
ఆనవా లీవింత యనువదించితో లేదా
క్షణములో నీతఁ డోషధుల నెఱిఁగె
కనుపట్టి త్రుటినీవు గాచి యుంటివో లేదా
చిటుకలో నితఁడు సంజీవిఁ దెచ్చె
ఓసుషేణ! అన్న! ఓ సమీరకుమార!
సుకృతమతులు మీరు శుభులు మీరు
మమ్ముఁ బ్రోచికొన్న మిమ్ము మాపాలిటి
యశ్వినీకుమారు లని తలంతు.

విభీషణుఁడు :

(ఆంజనేయు నభినందించుచు)

సుమనోవనము నందు సుఖదుఃఖఫలముల
నేక భావముగ నంగీకరించి
శాంతిసత్పథ మందు శత్రుమిత్రత్వముల్
సమగౌరవములుగా సమ్మతించి
పుణ్యాలయము నందుఁ బూజాతిరస్కృతుల్
తుల్యార్చనములుగా దోయిలించి
జ్ఞానదర్పణ మందు సర్వభూతంబులు
నాత్మబింబములుగా నవధరించి
మెలఁగు నీవంటి నిరపేక్షకులకు సత్స్వ
భావుల కుదారులకు ధన్యజీవనులకు

నోఁదఁగారాసి పరమార్థ ముండు నయ్య!
ఆర్తసంరక్షణోపాయ! అంజనేయ!

అగస్త్యుఁడు :

(పరమానందముతో! సనుగ్రహపూర్వకముగా)
శ్రీరామలక్ష్మణులు తల
పూరెమ్మయి వాడకుండ భూభరహరణా
ధారు లయి నిలువఁ గనిరేఁకేఁ
దీరని కోరికలు గలవె దివిజావళికిన్.

అఘమర్షణంబు దివ్యప్రభావంతంబు
శుభఫలోపేతంబు సుఖకరంబు
ఆయుష్కరంబు భోగారోగ్యకలితంబు
మహిమాన్వితంబు సంపత్ప్రదంబు
నిఖిలసంసేవ్యంబు నిత్యకల్యాణంబు
సౌభాగ్యసదనంబు సమున్నతంబు
ధర్మసంత్రాణంబు త్రైలోక్యవిజయంబు
సన్మంత్రసారంబు సమ్మతంబు
నైన యాదిత్యహృదయవిద్యారహస్య
మెఱుఁగ నుపదేశ మొనరింతు నిదె గ్రహించి
భువనకంటకు రావణు పొడ వడంచి
జగము లలరింపుమా రామచంద్రమూర్తి!

రామలక్ష్మణులు :

(అంజలి బద్ధులై యాదిత్యభగవాను నవలోకించి)

నీ మహోభ్యుదయంబు నిత్యకల్యాణమై
నవ్యమై విబుధనందనము గాఁగ
నీ సదాచారంబు నిత్యప్రసిద్ధమై
ధర్మమై సమయోచితంబు గాఁగ
నీ సత్యవృత్తంబు నిత్యాభిరామమై
మహితమై యాలోకమయము గాఁగ
నీ భవ్యతేజంబు నిత్యసంభావ్యమై
ధన్యమై సౌఖ్యవర్ధనము గాఁగ
నిత్యసన్మార్గగామివై నిత్యనూత్న
దర్శనంబున లోకబాంధవ మెసంగ
నిత్యమిత్రుండవై కృపానిరతి నిత్య
శుభుఁడవై మమ్ముఁ బ్రోవుమా! సూర్యదేవ!

సూర్యభగవానుఁడు :

(జ్యోతిర్మండలమునుండి సుప్రసన్నుఁడై)

అనిశోపలాలనానోన్యానురాగసం
పన్న సౌభ్రాత్రంబుఁ గన్న చోట
సతతేతరేతరాప్రతికూలకల్పనా
శీలసౌశీల్యంబుఁ గన్న చోట

నిరతంబు రస్వరాదరభావగౌరవా
కల్పసౌజన్యంబుఁ గన్న చోట
అనవరతహితక్రియామిథస్సౌభాగ్య
కరణసౌహార్దంబుఁ గన్న చోట
రామలక్ష్మణు లనుచు మీ ప్రేమమూర్తిఁ
దలఁచి, చూచి, జగంబెల్లఁ బులకరింప
నమరులై వర్ధిలుండయ్య! ఆసుధాంశు
తారకంబుగ రాజకుమారులార!

భరతవాక్యము :

శ్రేయముల కవిఘ్నంబు,
నమాయకులకు దైవబలము, మహనీయతరో
పాయులకుఁ గార్య సిద్ధియు,
సాయ మగుం గాక! లోకసౌభాగ్యముగాఁ.
ఖరఖరాఘదుష్టకంటకరహితమై
వరసుమంత్రసుజనభరిత మగుచు
సకలభోగభాగ్యసంజీవనం బయి
యవని రామరాజ్య మగును గాక!

# షట్పది

నల్లనల్లని వాఁడె నగుమోము వాఁడె
చిన్ని వేణువు నూఁదు చిఱుగొల్ల వాఁడె
ప్రణయసంగీతంబు పాడుచున్నాఁడె
ప్రేమ మీఱఁగ నిన్నె పిల్చుచున్నాఁడె
చిన్నారి విరిగొమ్మ సిగ్గేటి కమ్మ!
కన్నారఁ గనుమమ్మ కదలి రావమ్మ!
శిఖిపింఛియము వాఁడె సిరులీను వాఁడె
పసుపుపచ్చని పట్టు పుట్టంబు వాఁడె
అలరువాకిళ్లలో నాడుచున్నాఁడె
నిన్ను రమ్మన్నాఁడె నెఱనీటు కాఁడె
చిన్నారి విరిగొమ్మ సిగ్గేటి కమ్మ!
కన్నారఁ గనుమమ్మ కదలి రావమ్మ!

*　　　　*

చల్లచల్లని చూపు సరసాల వాఁడె
రాగాల భోగాల రంజించువాఁడె
పద్మరాగపుఁ దొట్టెఁ బవళించు వాఁడె
క్రొక్కారు చాఁపపైఁ గూరుచున్నాఁడె
చిన్నారి విరిగొమ్మ సిగ్గేటి కమ్మ!
కన్నారఁ గనుమమ్మ కదలిరావమ్మ!

*　　　　*

వాడవాడలవారి వలపించు వాఁడె
వీఁడువీఁడని చెప్పఁదగిన వాఁడె
చూడఁజూడఁగ నీడుజోడైన వాఁడె
నాఁడునేఁడును నీకు నచ్చి యున్నాఁడె
చిన్నారి విరిగొమ్మ సిగ్గేటి కమ్మ!
కన్నారఁ గనుమమ్మ కదలిరావమ్మ!

* *

వలపు వడ్డికిఁ బాఱ వచ్చి యున్నాఁడె
చిన్నఁ గానక నిల్వనేర కున్నాఁడె
పయనాలశ్రమఁ జాల బడలియున్నాఁడె
విందుగాఁ గ్రొందేనె వేడుచున్నాఁడె
చిన్నారి విరిగొమ్మ సిగ్గేటి కమ్మ!
కన్నారఁ గనుమమ్మ కదలి రావమ్మ!

* *

విశ్వస్వరూపుఁడై విహరించు వాఁడె
ప్రణయస్వరూపుఁడై పాలించువాఁడె
భాగ్యరాశివి గానఁ బరతెంచినాఁడె
గుణరాశి నీ ప్రేమఁ గోరుచున్నాఁడె
చిన్నారి విరిగొమ్మ సిగ్గేటి కమ్మ!
కన్నారఁ గనుమమ్మ కదలి రావమ్మ!

# పరామర్శము

తనయిల్లే సంసారము,
తన మనికియె మంగళంబు, తానే లోకం
బనకొని యొఱిఁగియు నెఱుఁగని
తనమున వర్తించు టేటి ధర్మము సుమతీ!
సుమతివెయయ్యేఁ దీవ్రతర
శోకదవానలఘోరతాపదు
ర్దమతమయాతనావివశ
తన్ మతి దప్పి స్వధర్మమంచు స్వా
ర్థమె తలపోసి చేసితి వ
ధర్మము, కాని మదిఁ పరార్థభం
గముఘటిల్లు టెంచ వృప
కారనికారము లార్తు లెంతురే!
ఆ ముని శాపము నాఁపఁగ
నీ మనువు న్నిల్పుకొనఁగ నిశ్చలనియమో
ద్దామోద్రేకంబునఁ దే
జోమయు జగదాప్తు నాఁపఁ జూచుట తగవే!
మూఁడు మూర్తుల జోలలఁ బాడి నట్టి
యుసుపగుగ్గిళ్ళ నోగిర మిడిన యట్టి
గరిత లున్నారు గాని నీకరణి ధరణి
సర్వసాక్షిని దాచిన సతులు గలరె?

మనమును ద్రిప్పలేక, చను
మానము పెంపొనరింపలేక, యే
చెనటినో కోరియు న్నతని
చిత్తముఁ గూర్చఁగ నాని కొంపలోఁ
జెనిమిటి దుష్ప్రవర్తనముఁ
బెంపొనరించితి లోకధర్మ వ
ర్తనమును గాదు, నీకు నుచి
తంబును గాదిది యాఁడుదానికిన్.

---

## శరత్కుమారి

వెన్నెలచీరఁ గట్టి, నెఱి
విచ్చిన రెల్లుతురాయిపెట్టి, మే
లెన్నిన సన్నజాజి పువు
బొత్తులఁ గ్రొమ్ముడిఁ జుట్టి, యేటివాల్
తిన్నెల నెచ్చెలుల్ వెదకి
తీయఁగ వెన్నెలవత్తు లాడుచున్,
బున్నమరేయిఁ దోఁచు విరి
బోణి విహంగిని యెట్టు లయ్యెనో!
కొలఁకుల విచ్చు చెంగలువ
కోవల వెన్నెల తేట నించి, చు

క్కల నిడి, రంగరించి తమ
కంబున నెత్తి, చకోరశాబకం
బుల నోడిఁ జేర్చి యుగ్గు లిడి
పువ్వుల తొట్టెలనుంచి, యంచతో
య్యాలులను నూఁపఁ బంపు జవ
రాలికి నేలొకో పక్షపాతముల్.

* *

ఘనతరు లెల్ల జిచ్చువడి
కన్గొనఁ గంచెలనున్న కేతకీ
వనముల సౌమనస్యమును
వర్ధిలఁజేయుచు నెండి ఓట తె
త్తిన నడగట్ల బంగరువు
తీగలఁ గూర్చి ఘనుల్ భ్రమింప, బ
ల్మి నిటు మెఱుంగుటీగ లెడ
లించుట యొప్పునె, మోహనాంగికిన్.

* *

తేటవన్నియమోము తెరవంక కన్నెలఁ
గలనిస్వనములతోఁ బలుకరించి,
పలుకవాఱిన పాలపండ్ల గుత్తులు గూర్చి
చిలుకబోదలకు విందుల నమర్చి,
ననదేనెఁ గొల్లలాడిన గండుఁదేంట్లను
పొదగొన్న లోఁగిండ్లఁ జెఱలు వెట్టి,

చెదరి తాటాడుచుఁ జెల్లనీడలఁ జేరు
చీఁకటికంటిలోఁ జిచ్చు వెట్టి,
ప్రకృతిలాలించి పాలించు బాల యయ్యు
జగతి రక్షించి శిక్షించు శక్తిఁ గాంచి
విశ్వవిస్మయలీల నివ్వెఱఁది యెట్లు
పరమపురుషప్రభావంబుఁ బడిసి నదియొ?

* *

అర్థప్రధానమోహనసస్యలక్ష్మికిఁ
గొలఁదలంపని తలకోత వెట్టి,
క్షామానుభావప్రభవరాజ్యలక్ష్మికి
నిండఁగూర్పని కలగుండు వెట్టి
అఖిలైహికార్థభవ్యక్షమాలక్ష్మికిఁ
బాపెఱుంగని గుండెబీట వెట్టి,
పరమార్థవిభవశోభనవిశ్వలక్ష్మికిఁ
దగులుసూపని వెల్లమొగము వెట్టి
ఇట్టి వచ్చి వర్షాలక్ష్మి కినుక వెట్టి
విజయలక్ష్మిప్రసంగంబు, వీథిఁ బెట్టి
రచ్చకెక్కించి నట్టి శరత్కుమారి
శారదేందిర యని యెట్లు పేరు గనెనొ!

## శ య నై కా ద శి

చూచి చూడఁగ లేదు-చూపవే, తామర
పువ్వులో నీ చిఱునవ్వు లేవో?
వినియును విన లేదు- వినుపవే, యెలదేఁటి
పాటలో నీ ముద్దుమాట లేవో?
తెలిసి తెలియ లేదు- తెలుపవే కలువపూఁ
దోపులో నీ తళ్కుఁజూపు లేవో?
కనియుఁ గానఁగ లేదు- కాన్పవే వెన్నెల
మెఱుఁగులో నీ మేని మెఱుఁగు లేవో!
శర దుదయవేళఁ గలఁత నిద్దురల వేళ
వలపు సొలపుల నడుమ నీ కలలె కనుచు
బ్రమపడుచు నుండె నాదినారాయణుండు
విభుఁ గటాక్షించి తెలుపవే విజయలక్ష్మి!

* *

పాటించి నీ వింత పలికితేఁ జాలదే
పలుకని బంగారు భాగ్యమేల?
నమ్మించి నీ వింత నవ్వితేఁ జాలదే
నవ్వనిరతనాల నాణెమేల?
మురిగించి నీ వింత ముట్టితేఁ జాలదే
ముట్టని ముత్యాల మూటలేల!

శోధించి నీ వింత చూచితే జాలదే
చూడని నీలాల మేడలేల?
పవలు రే యిట్టు లార్నెలల్ పండు కొనుట
వింతగాఁ జూచుచున్నది విజయలక్ష్మి,
భక్తపాలన బిరుద మేప్రక్కఁ బడెనో
తెలిసికొని తెల్పు మికనైన దేవదేవ!

---

## సమాలోచనము

ప్రభవ:

అఱువ దేండ్లకు మొదటి యేఁడైన ప్రభవ
అఱువదవ యేటఁ బుట్టిన యట్టి క్షయకు
వెనుక నుదయించె నదియేమి వింత యనుచు
నవ్వుచున్నది తొలుకారు పువ్వుగుత్తి!
పోయినది క్షయ నిన్నటి ప్రొద్దుతోనె;
ప్రభవ వచ్చిన దీనాఁటి పగటి పూట;
ప్రళయసర్గక్రియాపరంపరలె కాని
కానఁబడ దేమి తుది మొదల్ కాలమునకు?
నిన్నఁ బన్న వాఁడు చిన్న వాఁడై, నేఁడు
కన్న వాఁడు వాని కన్నయగుట

కన్న విన్న వార లున్నారొ "కో" యంచు
కొసరి కూయుచుండెఁ గోకిలంబు.
సకల మెడసి చన్న క్షయు నవ్వాలికిఁ ద్రోసి,
సహజవిభవు ప్రభవు నరసఁ జేరి
పలుకుచుండెఁ దీగవెలబోడి యని చిల్క
పండ్లు కొఱికి కొనుచుఁ బలుకు చుండె.
మాఱుపేరె కాని మఱి క్షయప్రభవఁ
గతుల భేద మేమి కల దటంచు
మల్లెతీవ లందు మాధవీలత లందు
తేఁటి యొక్కలాగె చాటుచుండె.
ప్రేమించి చుక్కలపేరు లొక్కని కిచ్చి
వికచప్రసవహార మొకని కొసఁగి
మేలెంచి నీలాలచేల లొక్కని కిచ్చి
కనకాంబరంబు లొక్కని కొసంగి
మన్నించి యొకనికి మాపుఁ దోడుగ నంపి
యింకొక్కనికి రేపు నెపరు గొలిపి
దీవించి పడమటితెర యొక్కనికిఁ దీసి
ప్రాగ్ద్వార మొకనికి బయలు పఱచి
క్షయుని సాగనంప స్వాగతంబును దెల్పి
ప్రభవు నాదరింపఁ బాలుగొన్న
సుప్రభాతసంధ్య సోలుచుఁ దూలుచుఁ
బొడుపు మలలఁ దేలిపోవు చుండె.

గిరిగహ్వరముల నిర్ఝరులు పొంగెడి చోటఁ
కొలకుల దరు లొడ్డగిలెడి చోటఁ
గఱుకుటానేలలు కందళించెడి చోట
నడవులు దావాగ్ని మడఁగు చోట
నలరులఁ దేలి పిందెలు క్రమ్ముకొను చోట
వాలుఁగొమ్మలఁ బండ్లు రాలు చోటఁ
ప్రాఙ్ముఖంబున మణిప్రభలు దోఁచెడి చోటఁ
గడలఁ జీఁకటి తెరల్ నడలు చోట
జగతిఁ బ్రభవక్షయక్రియల్ జరుగుచుండఁ
గనియు, క్షయపోయెఁ బ్రభవ వచ్చిన దటంచుఁ
దలచిఁ యాకాశపంచాంగములు గుణించి
పలుకు చుండుట వట్టి విభ్రాంతి కాదె!
అలరుఁ దెమ్మెరల రవ్వంతైన నిట్టూర్పు
పొగరు పోరక యుండఁ బోయినదియొ,
అమలవాహినుల గోరంతైనఁ గన్నీటి
బొట్టు జాఱక యుండఁ బోయినదియు
అలమువెన్నెలలఁ గాసంతైనఁ జీఁకటి
చాయ దేఱక యుండఁ బోయినదియొ,
అచ్ఛలగర్భములఁ బూసంతైన మిణుగురు
పోరక దూరక యుండఁ బోయినదియొ
ప్రాఁతసంవత్సరము కంటె నూతనముగ
నిపుడు వచ్చిన దేమి? పోయినది యేమి?

యింతలోఁ బేరుమాఱిన దంతె కాని
నిన్న నేటికి భేద మే మున్నదయ్య!
ఆకాశసరసీసముంచితావర్తములఁ
గన్నుంచి లెక్కింపఁ గలుగు వారు,
రోదసీప్రాసాదరుచిరసోపానముల్
కాన్పించి యెక్కింపఁ గల్గువారు;
పవమానసాగరాభ్రవిమానమార్గముల్
తిలకించి తెలియింపఁ గలుగు వారు,
జలపటాంచల సముజ్జ్వలసువర్ణాకృతుల్
గ్రహియించి చదివింపఁ గలుగు వారు,
శూన్యమున నంకములఁ దేర్చి చూపు వారు
ఘటకులై గంటములఁ దీర్చి కవిలెఁ గూర్చి
వ్రాసి చూపించి రేకాని, వాస్తవముగఁ
గాలమునకును బరిణామ గతులు గలవె!
ఒక వసంతంబు గడచి వేఱొక వసంత
ముదయ మగు నంతనే వత్సరోదయంబు
నుపవనాంతరములఁ బ్రమోదోదయంబు
నఖిలజీవశుభోదయ మగుట నిజము.

వర్తమానము:

ప్రభవ విలసనంబు, విభవ విన్యాసంబుఁ
దెలిపి కొనుచుఁ దన్నుఁ గలిపి కొనుచు
నన్ను విడువ కెపుడు నాతోడనే యుండు
వర్తమానమునకు వందనములు.

## దేవుఁడు

శ్రీమదనందకోటిపర
నీజభాండములన్ సృజింపగాఁ
ప్రేమపదంబున న్నిలువ
రింపహారింపఁగఁజాలి నిత్యశు
ద్ధామృతమూర్తి వై వెలుఁగు
నట్టి యనంతు, ననాది, దైవత
గ్రామణి నెవ్వరేవిధము
గా భజియించిన నేమి సన్మతిన్!
నెలరేకగుఱుతుంచి నిలిచి 'అల్లా' యన్న
మరమేకుఁగని "యేసుదొర" యఁటన్న
వెలిబూది మెయిఁబూసి "విశ్వేశ్వరా" యన్నఁ
దిరునామములువెట్టి "హరి"యఁ టన్నఁ

బసుపుఁగుంకుమ వోసి "భద్రకాళీ" యన్నఁ
గుడుము లర్పించి "కొక్కుదొర" యన్నఁ
జలికుండఁ దలఁదాల్చి "సామలమ్మ" యన్న
నవతారములు పాడి "యప్పఁ" డన్న
నెవ్వ రెట్లునిలిచి యెవ రెట్లుపిలిచిన
నెవ్వ రెట్లుకొలిచి యెంచుకొన్నఁ
దేర్చి తీర్చునట్టి దేవుఁడొక్కఁడె కాఁడె.
ప్రాజ్ఞులైన పరమభక్తులార!
తలయెత్తి కొండకేఁకలఁ బెట్టిననుగాని
కనుమూసి గొణగొణ యనినఁగాని
కరతాళములఁ గొట్టి గంతు లేసినఁగాని
యుసుఱులు బిగియించి యున్నఁగాని
పునిప్రొద్దు గంగల మునిఁగి తేలినఁగాని
నిట్టుపాసములఁ గుందినను గాని
జాతిబొమ్మలఁ గొల్చిజోత లొగ్గినఁ గాని
పెనుమ్రాఁకులకు వలగొనినఁగాని
యెవరి భక్తి వారిదే యని మన్నింప
వలయుఁ గాని తప్పు దలఁప రాదు
దేవునకుఁ బ్రియంబు దృఢభక్తియే కాదె
ప్రాజ్ఞులైన పరమభక్తులార!

# భార్గవుఁడు

సంపదఁ లొసఁగి విశ్వము నేలఁ జాలిన
యాదిలక్ష్మిని గన్న యనఘుఁ డొకఁడు,
స్వాశ్రితకోటిని సంజీవకరణిచే
మనుపంగఁ జాలిన మాన్యుఁ డొకఁడు,
నృపతుల వెచ్చని నెత్తుటఁ దనతండ్రి
పగ దగఁ దీర్చిన ప్రౌఢుఁ డొకఁడు,
ప్రతిహింసకై పూనఁబట్టిన కోపాగ్ని
జలనిధిఁ బెట్టిన బలియుఁ డొకఁడు,
కాంచి, గ్రహియించి, మడుగులు గట్టి, మనసుఁ
బెట్టి, దాన నిల్పి కొనిరి పృథ్వియందు
భార్గవులు వారు- నీవును భార్గవుఁడవు;
గోత్రమర్యాద నుడి నిల్పుకొందు గాక!

## జనార్దనా!

మేలికవిత్వసఁపదల
మేకొని, చేకొని భక్తిముక్తులీఁ
జాలిన నీ పదాబ్జముల
సమ్మతిఁ గొల్వఁగలేక, మోహమా
యాలసవృత్తిఁ జిక్కి, పర
మార్థముదక్కి పరిభ్రమించి, నేఁ
జాలఁగఁ దప్పు చేసితిని
సైరణ సేయఁగదే జనార్దనా!

* *

నీ కరుణావిశేషమున
నెమ్మది గూర్చి, భక్తకోటిలో
నా కొక తావు లేదను
మనః పరితాపముఁ దీర్చి, నిత్యసౌ
ఖ్యాకరమైన నీ పద
యుగార్చన మిచ్చి, భవాబ్ధి నింక నా
నౌక మునుంగకుండఁ గను
నావికుఁ డీవెసుమీ జనార్దనా!

## చాటూక్తులు

తెల్లని పద్మవల్లిఁ గళ
దేటఁ జెలిం బలికించు జాణయై
తెల్లని పాలవెల్లిఁ జవి
దేటఁ జెలిం దొలఁకించు ప్రౌఢయై
తెల్లని కొండపల్లి వడ
దేటఁ జెలిం గులికించు దిట్టయై
తెల్లని వెల్ల నేలికొను
దేవుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్.

*　　　*

నాలుగు మాట లాడ నొక
నాటక మాయెనె! పట్టి యేడ్పులో,
మూలుగులో, ముసాఫరుల
ముచ్చటలో, మగమాటుపాటలో,
వాలుగకంటిగోటు వలె
పాటులు నేర్వని కన్ను గీటులో,
జీలుగు బెండ్లులై నటనఁ
జేసిన, వ్రాసినఁ గీర్తి వచ్చునే.

పగటి పూటలకును బద్మమిత్రుఁడు వెల్గు
మాపులకును జందమామ వెలుఁగు
తల్లిదండ్రికనులఁ బిల్లపాపలు వెల్గు
జానమే వెలుంగు సాధువులకు.

* *

వరకరీంద్రములకు వంకర తుండంబు
దొడ్డ కుక్కలకును దోఁక వంక
అడ్డగాడిదలకు నడుగులు వంకర
గ్రీవ లెల్ల వంక దుర్జనులకు.

* *

పన్నగములకు వీనులుఁ గన్ను లొకటె
కుంజరములకు దంతముల్ కొమ్ము లొకటె
కోఁతిజాతికిఁ గాళ్ళును జేతు లొకటె
ఒక్కటే మండుకమునకు ముక్కు నోరు.

* *

జగతి జనున' కెందు సద్విద్య యొక కన్ను
చక్కనైన బోధ యొక్క కన్ను
విశ్వవిభుని యందు విశ్వాస మొక కన్ను
గాని తోలుకనులు కనులు గావు.

* *

లంచగొండి కాత్త్రియులు లాతు లొకటె
బిడ్డలును మేక లొక్కటే పెద్దపులికి
పగలు రేయొక్కటే పిల్లిపాపలకును
ఎడ్డెనగపాలునకు మంచి చెడ్డ యొకటె.

గంగకంటె లోతుగల మహానదియును
హిమనగంబు కంటె నెత్తు కొండ
కొమ్ముకన్న కంటె గొప్ప మృగంబును
కానఁబడదు భరతఖండమందు.

* *

ఉత్తమాంగమునకు నొత్తుకురుల్ రక్ష
వ్రేళ్లకొనల కెందు గోళ్ళు రక్ష
సప్తధాతువులకుఁ జర్మాంశుకము రక్ష
యెల్లరకిని రక్ష యీశ్వరకృప.

*

కాకి గొడ్డువీగు కాను పొక్కిటి గాంచి
చూలు విడిచి యడగు సాలెపురుగు
కాన్పుతోడఁ గదళి ఖండితంబగుఁ, బులి
కాన్పు మ్రింగి బ్రదుకుఁ గానలోన.

* *

బల్లిపాటునకు దొండ ప్రాకుటకును
దార తిరుగుటకును రేక దేకుటకును
తప్పుఫలములు చెప్పు కార్తాంతికునకు
నెప్పుడో యెప్పుడో తిట్లు తప్పబోవు.

* *

ఏనుఁగు దాహమో, ఘుటుఁగు పట్టో, లొట్టె
వాలకమో, గూబ వర్తనంబొ?
గాడిదకంఠమో, కాకిచూపో, మేక
పోతుగాంభీర్యమో, పితనడయొ,

కొక్కిరధ్యానమో, నక్కజిత్తో, గంగి
రెద్దు సంచారమో, యెలుక దొలుపో,
కప్పదాటో, పిల్లికప్పో, కోతిగుణంబో,
జాగిలంపు హుషారో, డేగ యొడుపో,
తేలుకుట్టో, కోడి కాలుబంటుతనంబో
పందిమఱపో, త్రాచుపాము పగయొ
తఱచి చూడఁజూడఁ దలతల కొకటైన
లేకపోదు మనుజలోక మందు.

* *

క్రూరుఁడ నంగరాదు రిపు
కోటుల యాయువు మట్టుపెట్టినన్
చోరుఁడ నంగరా దహిత
శూరుల మానము కొల్లపెట్టినన్
జారుఁడ నంగరాదు పర
జాయల యాలువు భంగపెట్టినన్
శూరుఁడు నీవుఁ డాతఁడె
యశోనిధి ధీనిధి యెల్లభంగులన్.

కామవిభూతి:

రతిమాంగల్యవిభూతియు
నతనుభవవిభూతి, శైలజానులసేవా
రతిజయవిభూతి, గౌరీ
పతి కామవిభూతి భువనభద్రము లొసగున్.

# శ్రీ రా మ రా జ నీ తి

ఆశీర్వాదము:

శీతమలస్వభావుఁడు, ప
రిస్ఫుటసత్యతపఃప్రశాంత తే
జోవిలసత్ప్రభావుఁడు, వి
శుద్ధమహామహిమానుభావుఁ
డెవ్వఁడు ప్రేమభావుఁడు సు
ధీయుతు, శ్రీయుతు, సన్నుతుం జిరం
జీవిని జేయు సూర్యకుల
శేఖరు, శ్రీకరు, రామరాయనిన్ .

సత్యవ్రతంబుతో సరసమూలముఁ గాంచి
మహితధర్మంబుతో మ్రాను గట్టి
శాంతపద్ధతులతో శాఖల వెలయించి
శుచివర్తనంబుతో సొబగుఁ జూపి
సుగుణరత్నములతోఁ జిగురుటాకులు వెట్టి
కరుణారసంబుతోఁ గళిక లెత్తి
సుప్రబోధంబుతో సూనముల్ విరియించి
పావనప్రేమతోఁ బండ్లు పండి
ప్రజలపాలి భూలోకకల్పకమ వగుచు
లలితనిత్యవసంతవిలాసకలన
దినదినాభ్యుదయమున వర్ధిల్లు మయ్యా
రావు సూర్యగంగాధరరామరాయ!

మంగళమయుఁ డగుదేవుని
మంగళ కరుణాకటాక్షమహితవిభూతిన్
మంగళమయుఁ డగునీకున్
మంగళము లొసఁగు సూర్యమహీపకుమారా!

---

కానుక:

మారాజుకొమరుండు మన్నింపకుండునే
వలపుల నీను చెంగలువదండ
మానిభూపతి సమ్మతి నందకుండునే
కమనీయనవమల్లికాస్రజంబు
మా యినతనయుండు మదిమెచ్చకుండునే
సరువంపుఁగెందమ్మి విరిసరంబు
మా మహీంద్రసుతుండు ప్రేమింపకుండునే
సురభిళకల్ప ప్రసూనమాల
యనుచు భావించి యామోద మతిశయించి
రామచంద్రుని నీతి సూత్రము గ్రహించి
రమ్య కావ్యప్రసూనహారము రచించి
చిన్నియువరాజునకుఁ గానుక చేసినాము.

## శ్రీరామరాజనీతి

శ్రీరామరాజనీతి ను
ధారస మఖిలేప్సితార్థదాయకమై చె
కూరఁగ గంగాధరరా
మారాయా! మనుము మనసమాచప్రతిభఁగా
బంగారము నెత్తావి నె
సంగినక్రియ నీదు లేఁత జవ్వనము మధ
సంగతి సలుపుంగావుత
గంగాధరరామరాయ! కవిజనగేయా!
నెయ్యముఁ దియ్యముం గదుర
నేరుపు నోరుపు నుల్లసిల్లఁగా
నయ్యలు మెచ్చ సాధువుల
హా! యన నెమ్మది సమ్మదంబుతో
వియ్యముసేయ లేకు ఒం
విచ్చినపువ్వుల కమ్మఁదావితోఁ
బయ్యెర వీచినట్టు లోక
పాలము సెప్పెద నాలకింపుమా!
రాముఁడు శుభకాముండై
సౌమిత్రికి రాజనీతిసారము దెలుపం
గా మొదలిడి ప్రేమమయుసు
భామధు రామలక్ష్మణమూర్తిఁ దానిట్లని మోదా.

అనయము పొందకుండు గతి
సర్థసమార్జనమున్, దదర్థవ
ర్ధనమును, రక్షణక్రియయుఁ
దత్పరతం బొనరించుచుండ న్యా
యనియతిఁ జేసి పాత్రముల
నారసి దానము సేఁతయున్ జగ
ద్వినుతములై యశోధనముఁ
దెచ్చుచతుర్విధరాజవృత్తముల్.

వినయము నయమూలం బగు
వినయము శాస్త్రార్థనియతి వెలయింపబడున్
వినయము జితేంద్రియత్వమె
వినయి యగుచు నేలవలయు విభుఁడుధరిత్రిన్.

శాస్త్రంబుఁ బ్రజ్ఞయు సమధికధైర్యంబుఁ
గార్యదక్షతయుఁ బ్రగల్భతయును
నుచితభాషణమును నుత్సాహశక్తియు
నవధానతయు మహోదారగుణము,
నాపత్సహిష్ణుత యమలప్రభావంబు
నిత్యశుచిత్వంబు సత్యరక్ష
చారుశీలము మనోజ్ఞత యాభిజాత్యంబు
త్యాగంబు మైత్రియు దమము ననఁగఁ
బరగు నుత్తమగుణములు పార్థివునకు
నభ్యుదయకారణంబులై యవని ప్రజకు

నిత్యకల్యాణకరములై నెగడుచుండు
సంద్రదు నయతత్త్వవిజ్ఞానులైన మునులు.
క్రూరవిషమ విషయాటవిఁ
బారెడునింద్రియమదేభపంచకము మహా
ధీరుఁడు జ్ఞానాంకుశమున
వారించి తెమల్చి తేర్ప వలయుఁగుమారా!
నరపతి కామక్రోధా
ద్యరిషడ్వర్గము జయించి యభ్యుదయపరం
పరలం గాంచుచు ధరణీ
భరణక్షముఁడై వెలుంగ వలయుఁ గుమారా!
నరుస నన్వీక్షకీత్రయీ వార్తలందు
దండనీతిని గుశలులై తత్క్రియాస
మర్థులగువారిచెంతచే పార్థివుండు
చేరి యాలోచనంబులు సేయవలయు.

జ్ఞానము లభించు నన్వీక్షకీనియుక్తిఁ;
ద్రయిని దోఁచు ధర్మాధర్మతత్త్వభేద;
మర్థము, ననర్థమును వార్తయందుఁ దెలియు;
దండనీతి నయానయాధ్వములఁ జూపు.
హింస తెరువునఁ బోక సూనృతము విడక
సత్యశౌచదయాక్షమాశాలి యగుచు
జగతి సన్మార్గగామియై చనుచు నుంటి
యెల్లర కవశ్యధర్మమై యొసఁగుచుండు.

సారమతిఁ భజింపుము ప్ర
జం గరుణించి, పురాతనోత్తమా
చారము నిల్వరింపు మని
శ్రప్రియభాషణ మాచరింపుమీ
దూరము సేయుమీ పరుల
దుఃఖము, దీనుల కాశ్రితాళి కా
ధారముఁజూపు మర్థములఁ
దన్పుము పేదల సాధుమూర్తివై
ఇది సత్పురుషులవృత్తం
బిది సాధుజనానుమోదహితసువ్రత మి
య్యది సర్వథాప్రశస్తం
బిది యుపకారము ధర్మ మిది రాజునకున్.
కాయికంబులు మానసికంబులైన
బాధలకు సాధ్యమై క్షణభంగుర మగు
మేనిపై నాసల వృథాభిమాని యగుచుఁ
బాపగతిఁ బోవఁగారాదు పార్థివునకు.
బాధితుండై నకృపణుండు ప్రబలకోప
కలుషితుండయి ప్రభుఁజంపఁ గడఁగుఁగానఁ
దనసుఖంబున కాసించి మనుజనాథుఁ
డెపుడుఁ బీడింపఁగారాదు కృపణజనుని.
పూజ్యులగు సజ్జనుల నెట్లు పూజసేయు
సంతకంటెను నధికప్రియంబు సూపి

యాత్మకల్యాణమును గోరు నట్టి విభుఁడు
చేరి కుజనులఁగూడఁ బూజింపవలయు.

ప్రియవాదులు దేవతలు
ప్రియవాదులు పశువులగుటఁ బృథ్వీపతి ని
శ్చయముగ మిత్రుల శత్రులఁ
బ్రియభాషలఁదనుపవలయుఁ బ్రియసాధకుఁడై.

ఆస్తికుండు నిశ్చలామలహృదయుండు
ధర్మరతుఁడు భక్తితత్పరుండు
నగుచు నిత్యమీశ్వరారాధనము సేయు
నట్టి విభుని శుభము లందుచుండు.

నరపాలుఁడు నయగుణత
త్పరుఁడై గురువులను దేవతామూర్తులుగాఁ
బరమసుహృత్తులఁ దనప్రా
పరివారలుగాఁగ జూడఁ జను నెయ్యెడలన్.

సతిచే గురుతతి, సత్యని
యతిచే సాధుతతి, సత్క్రియల దేవతతిన్
రతిచే నిజసతి, దానని
రతిచే భృత్యతతి నృపతి రంజింపఁదగున్.

పరమమిత్రుల నిత్యసంభావనమున
నాత్మబంధుల నిత్యసంప్రార్థనమున
నన్యజనముల నిత్యకటాక్షకలన
జనపతి వశీకృతులఁ జేసి కొనఁగవలయు.

పరులసేతలఁగాంచి పరిభవింపఁగఁబోక
నిజధర్మపాలన నియతి నలరి
కృపణజనంబులఁ గృపఁజూచి యెల్లెడ
నమృతభాషణముల ననువదించి
ఊసురిచ్చియే నాప్త నుపకృతిఁ దనియించి
శరణాగతునకు నాశ్రయ మొసంగి
తనయోపినకొలంది దానంబు సేయుచు
నున్నతి కిసుమంత యుబ్బఁబోక
సహనినై పరోన్నతికి మత్సరముఁ గనక
పరుల నొవ్వనాడక మితభాషియగుచు
బంధుపరిజనావనుఁడయి పరమధర్మ
నిరతుఁడగు రాజు మహనీయచరితుఁ డగును.

స్వామ్యమాత్యులు దుర్గరాష్ట్రములు బలము
నర్థము సుహృత్తు ననెడి సప్తాంగములును
నొకట నితరేతరోపకారకనియుక్తి
నమరియుండినచో రాజ్య మగును వత్స!
అట్టిసప్తాంగకంబుల యందు నుత్ర
శస్తమగుసాధనంబు రాష్ట్రంబె కాన
సావధానంబుగా సదసద్వివేక
కలన రాష్ట్రంబుఁ బాలింపఁ గడఁగవలయు.
కులమును శీలంబుఁ జెలువంబు వయసును
సిద్ధసత్త్వము వృద్ధసేవనంబు

దాక్షిణ్యమును నాడి తప్పమి, సత్యంబు
చుఱుకుఁదనంబు మేల్మఱవకునికి
దైవబలంబు నుత్తమబుద్ధి దృఢభక్తి
యక్షుద్రసుపరివారాభియుక్తి
శక్యసామంతత సమధికశౌచంబు
ధార్మికత్వంబు నుత్సాహశక్తి
దంభరాహిత్యమును దీర్ఘదర్శితయును
వినయమును స్థూలలక్ష్మ్యత్వ మనఁగ నొప్పు
మేలిగుణముల సాధుభూపాలకుండు
నిత్యసుశ్రీకుఁడై కీర్తనీయుఁ డగును.

నరనాయకుఁ డక్రూరులఁ
బరోపకారులఁ బ్రశస్త వంశ్యుల శుచితా
నిరతుల నాత్మహితులఁ దన
పరివారమునందుఁ జేర్ప వలయుఁ గడంకన్.

వాక్పటుత్వము ప్రగల్భతయు నుదగ్రత
స్మృతియును విజితేంద్రియతయు బలము
నిపుణత్వమును దండనేతృత్వమును గళా
జ్ఞతయుఁ బాత్రజ్ఞత సత్యశీల
మన్యేంగితజ్ఞాన మభియోగసహ్యాత
దుష్టప్రతిక్రియ దూరదృష్టి
యర్థసంకలనసమర్థత యక్రోధ
మద్రోహ మవిలోభ మచపలవృత్తి

సంధివిగ్రహతత్త్వపరిశక్తి దేశ
కాలభేదజ్ఞత పరోపకారబుద్ధి
సారమంత్రప్రచారదక్షత పరోప
తాపమై ముఖ్యముప్రశాంతతయు మఱియుఁ
వినయమృదుసూక్తి, నిర్భీతి వృద్ధసదుప
దేశసంపత్తి, యనసూయ దివ్యశక్తి
రమ్యశీలత, సుగుణానురాగ మనఁగఁ
బరగునియ్యవి యాత్మసంపద్గుణములు.
కులముగలవారు, శౌర్యంబు గలుగువారు
అపలు లగువారు, విశ్రుతులైన వారు
ఆప్తులగువారు, నీతిజ్ఞులైనవారు
ధరణివిభునకు మంత్రిగాఁ దగినవారు.
పలుకుపొందికవాఁడు ప్రతిభ గల్గిన వాఁడు
వేయికన్నులఁజూచు విద్యవాఁడు
ధైర్యంబు స్థైర్య ముత్సాహంబుగలవాఁడు
గౌరవకీర్తులఁ గన్నవాఁడు
సత్యశీలమువాఁడు సాత్వికుండగువాఁడు
నఖిలకళాపూర్ణుఁడైనవాఁడు
శుచిమంతుఁడగువాఁడు సుస్థిరుండగువాఁడు
ప్రజ్ఞాప్రభావ సంపత్తివాఁడు
అచలుఁడగువాఁ డనామయుఁడైనవాఁడు
ఓర్పుగలవాఁడు, పగవారి నోర్చువాఁడు

ఆత్మవిశ్వాసియై దక్షుఁ డైనవాఁడు
ధరణిపతిమంత్రిగాఁ జేయఁ దగినవాఁడు.

అర్థపరత, స్మృతియు, నన్యాచిత్తజ్ఞత
నిబ్బరంబు, జ్ఞాన నిశ్చయంబు
మంత్రగుప్తియనెడి మహనీయగుణములు
సంపద లగు మంత్రి సత్తములకు.

వేదవేత్త, ధర్మాధర్మవిదుఁ, డధర్మ
పథనిరూపిత శాంతిక పౌష్టికాది
బంధురక్రియాచరణధురంధరుండు
నగుపురోహితుఁ డుండఁగాఁ దగును బతికి.

హితు లగుతద్జ్ఞులవలనఁ
మతిమంతుం డైనరాజు మంత్రులశిల్ప
జ్ఞతయును, సూక్ష్మాలోక
స్థితియును నిరతముఁ బరీక్ష సేయఁగ వలయున్

అన్వయంబు, నివాసంబు, నాదరంబు
ధారయిష్ణుత్వమును, గార్యదక్షతయును
నంతసంబుఁ, బ్రాగల్భ్యంబు జ్ఞానగతియు
జనవిభుఁ డెఱుంగఁదగు నాత్మజనుల వలన.

మంత్రివరులఁ గలసి మాట లాడెడి వేళ
వారిసత్యవచన గౌరవంబు
పాటవంబు, మధురభంగి, యొప్పిదమును
జనవిభుండు తెలిసి కొనఁగవలయు.

సమధికధైర్యంబు, క్లేశ
క్షమతయు, నుత్సాహగరిమ, స్థైర్యంబు, ప్రభా
వము, నను రాగము నాప
త్సమయంబులలోఁ బరీక్ష సలుపఁగ వలయున్.
వ్యవహార విశేషంబుల
వివరించెడివేళలందు విశ్వాసంబున్
బ్రవిమలచరితము, మైత్రియు
నవధారణ సేయవలయు నవనిపుఁ డాత్మన్.
మంత్రిసహాచరులం జేటి మంత్రివరుల
సత్యము, బలమ్ము, శీల, మ స్వభ్ధతయును
శౌర్య, మారోగ్య, మరితిరస్కరణదీక్ష
యును యథాస్థితిఁ దెలియుట యొప్పుఁ బతికి.
నరపతి ప్రత్యక్షంబున
నరయవలయు జనులభద్ర తాభద్రతలన్
బరగుణవృత్తంబులు ఫల
పరిణామంబులనె తెలియఁ బడు నెయ్యెడలన్.
ప్రభుఁడు ధర్మార్థకామశాస్త్రంబులందు
నస్త్రశాస్త్రంబులందు, శిల్పాది కళలఁ
గోవిదులు, నుత్తములు నైన గురులయొద్దఁ
బ్రియతనూజులచేఁ జదివింపవలయు.
కోపశీలురు, లోభులు, క్రూరమతులు
విమతులు, విమానితులు, దుష్ప్రవృత్తు లల్పు

లాతతాయులు, గుణహీనులైనవారి
చెంతఁ దనయుల నెన్నఁడుఁ జేర్పరాదు.

జనపతి నేర్పు మీఱఁ దను
జన్ముల విద్యలసత్క్రమాభివృ
ద్ధిని గనుఁగొంచు నిర్మలసు
ధీకలనంబు, విశుద్ధసత్యవ
ర్తనమును బ్రోదిసేయుచును
దత్త్వము, ప్రాయము, శక్తియుం గనుం
గొని యధికార పద్ధతులఁ
గూర్చుచు ధీరులఁ జేయఁగాఁ దగున్.

ప్రజలఁ దెలియ నెఱిఁగి పలుకులపొందిక
వారిఁ దనుప నెఱిఁగి వారికొఱకుఁ
జిత్రఖేలనములఁ జేకూర్చుట యెఱింగి
మేదినీశ్వరుండు మెలఁగవలయు.

అధికపరిచయమున నగు లాఘవము గానఁ
బరిజనంబుతోడఁ బలుకునపుడు
సేవకాళి దన్ను సేవించునప్పుడు
నవనివిభుఁడు నవ్వులాడ రాదు.

కాలాకాలము లెఱుఁగక
వాలాయము నొక్కరీతి వసుధాపతి దీ
ర్ఘాలోచనపరుఁడై నట
నాలమ్ము, శీలంబుఁ, గార్యగతియు గతించున్.

కోపము, ప్రేమము, దర్పము
పాపకృతియు, ద్రోహవృత్తి, పరుషక్రూరా
లాపము ధరణీపాలుఁడు
చూపవలయునెడల దీర్ఘసూత్రత వలయున్.
సుప్రధానమైన, నప్రధానం బైనఁ
గొలఁదిపాటి దైన గొప్పదైన
భూవరుండు సేయఁ బూనిన కార్యంబు
ఫలమునను దెలియంగఁ బడఁగ వలయు.
పార్థుఁడొంటినైన నఁ బలువురతో నైనఁ
జేరి మంత్రచర్చఁ జేయరాదు
పెక్కుమందితోడ వేర్వేఱ చర్చింప
వలయు నొకరి దొకరు తెలియకుండ.
పలు తెఱంగులయచ్చపచ్చపైరులు గల్గి
బహుమూల్యరత్నగర్భములు గలిగి
ప్రవిమలరసమయప్రచురాంబువులు గల్గి
పరువమై తగినంత విరివి గలిగి
పసిఁ బెంపఁగలపచ్చికసవుపట్లులు గల్గి
యారోగ్యభోగభాగ్యములు గలిగి
సాధుజనాకీర్ణ జనపదంబులు గల్గి
మొల్లెడ వలసిన వెల్లఁ గలిగి
స్థలపథంబులు, జలపథంబులును గలిగి
భద్రమాతంగసంతాన బలము గలిగి

మహితమై, రమ్యమైనభూమండలంబు
జనపతికి భూరిభూతిసాధనము వత్స!

శిల్పులచే వణిగ్వరుల
చేఁ గృషికావళిచే హితక్రియా
కల్పులచే సమస్తవిధ
కష్టసహిష్ణులచే స్వధర్మసం
కల్పులచే సుధీజనని
కాయముచే బలగోసమృద్ధిచేఁ
బొల్పగునూళ్లె వర్ణ్యతమ
ముల్ గమనాగమనప్రజాళిచేఁ.

సరిదద్రిమరువనాశ్రిత
మురుతరపరిఖాగభీర మున్నతవరణ
స్ఫురదగ్రతోరణము, వి
స్తర మగుపురమున వసింపఁ దగుభూపతికిఁ.

పితృపైతామహజనసం
చితము, స్వధర్మార్జితంబు, చింతితనకలే
ప్సితవస్తుయుతము, వ్యయన
మ్మృత మగుకోశంబు వెలయు మహితార్థదమై.

పితృపితామహసమాగతమును, పౌరుష
విఖ్యాతమును, దత్తవేతనమును
దృఢవిరాజితంబును దీప్తంబు, నాహవ
దక్షంబు, శుభగుణ లక్షితంబు

నంతర్విరోధశూన్యము, క్షాత్రవంతంబుఁ
గరితురగానీకపరివృతంబు
బహుయోధభరితంబు బహుశస్త్రకలితంబు
వశ్యంబు, విజయసంవర్ధనంబు
దుర్భరప్రవాసదుఃఖక్షమంబును
దారుణాధ్వగమనభారవహముఁ
గదనరంగవిపులకష్టసహంబును
నైన బలమె సుబల మవనిపతికి.

యోగవిజ్ఞానసత్త్వుండు నురుసహాయుఁ
డాయతిక్షమాశాలి, ప్రియంవదుండు
సత్కులీనుఁ, డద్వైధప్రచారుఁడైన
గుణమయుని మిత్రుఁగాఁజేసి కొనఁగ వలయు.

ఎలమి దవ్వుదవ్వులనె చూచి యెదురుకొనుట
మనసు విచ్చి మాటాడుట మన్ననయును
సభిమతబహూకృతులు సేత యనెడు నివియె
సాధుసన్మిత్రసంగ్రహ సాధనములు.

అమలధర్మఫలము నర్థఫలంబును
బ్రేమరసవిశిష్ట కామఫలము
ననెడి త్రిఫలసిద్ధి యొసగుచుండు సన్మిత్ర
మూలముననె భూమిపాలకునకు.

ఔరసుఁడును, సన్నద్ధుఁ డు
దారసవిత్రాన్వయక్రమాగతుఁడును ను

ర్వారవ్యసనవిదూరుఁడు
నా రంజిలు మిత్రవరుఁడు నలుదెఱఁగులచేఁ.
నిత్యప్రియవాదిత్వము
నత్యంతాకపటవృత్తి మగు చిత్తంబున్
సత్యవ్రతనిరతియు, శా
ఖ్యాత్యయసమగతియు మిత్రు నందలి గుణముల్.
దార్ఢ్యమును, భద్రతయుఁ, గార్యదక్షతయును
గష్టసహనంబు, క్షమయును గౌతుకంబు
చారుశీల, ముత్సాహంబు స్వామిభక్తి
గలుగుభృత్యులఁ జేర్పఁగా వలయుఁ బతికి.
క్రౌర్యకలనమును, బరస్థానగమనంబు
మదనముద్ధతియును మత్సరంబు
ననుచతుర్విధంబులై నదోషంబులఁ
జొవరాదు రాజసేవకులకు.
ఘనులను ద్వేషింపక యే
లినవానిరహస్యముల వెలిం బెట్టక, య
త్యనురక్తుని విడక, విర
క్తుని గొలువంబోక సేవకుఁడు మెలఁగఁదగున్.
భృత్యులెప్పుడు సవిధేయ కృత్యములను
దలఁపఁగాఁబోక నిత్యకర్తవ్య కార్య
దక్షులై స్వామిసేవాప్రధాను లగుచు
నధిపుకరుణ వృత్తిలాభంబు లందవలయు.

పతియాకారేంగితముల
గతిచేష్టల నేత్రవక్త్రగతులను మృదు భా
షితముల నాతనియంత
ర్గతభావము పరిజనంబు గనిపట్టఁ దగున్.

దేవునిచే నానావిధ
జీవావనమునకుఁ దా సృజింపఁబడుట వ
ర్ణావిభుపోలిక నేలిక
జీవుల కుపజీవ్యుఁ డగుచు జీవింపవలెన్.

న్యాయజ్ఞుల బహుకార్యో
పాయజ్ఞులఁ జేర్చి యగ్రపదరూఢులుగాఁ
జేయుచు నాయమ్ముల నా
దాయము వర్ధిల్లఁజేయఁ దగు భూపతికిన్.

కోట, పొలిమేర, సేద్యంబు, బాట, శూన్య
వేశనము, గజబంధంబు, విపణివృత్తి
ఖనినిధానబలాదాన మనెడు నిట్టి
యష్టవర్గంబు భూనాథుఁ డరయ వలయు.

రాజహితులచేత, రాజలోభముచేత
ఖలులచేత, దొడ్డకార్లచేత
నాతతాయులైన యాయుతికాండ్రచేఁ
బ్రజకు భయము గలుగుఁ బంచ గతుల.

కానఁ బ్రజకు భయము గలుగంగనీయక
చనవు నెఱప నెఱిఁగి సమయమెఱిఁగి

కనికరింప నెఱిఁగి మనసు ద్రిప్పనెఱింగి
మనుజవిభుఁడు కరము గొనఁగ వలయు.

నృపతి జితేంద్రియుం డయి శ
రీరము రాజ్యము రక్షసేయుచుఁ
గపటుల దుష్టులఁ వ్యసన
కారుల నారసి శిక్షసేయుచున్

స్వపరిజనాళి నాశ్రితుల
బంధులఁ బుత్త్రికళత్రమిత్రులన్
గృప నలరించుచుఁ బగఱ
నెప్పుడు నమ్మక యుండఁగాఁదగుఁ.

బలవంతునితో వైరము
కలిగిన యవసరమునందుఁ గల్యాణమహో
ఫలకాముఁడైన భూపతి
చెలిమికలిమి నెఱపి సంధి చేసికొనఁ దగుఁ.

అరసి, కపాలోపహారంబులనఁగను,
బురుషాంతరాదృష్టనరము లనఁగ,
రిపుతిరస్కరణపరిక్రమంబు లనంగ,
స్కంధోపనేయసంగతము లనఁగఁ,
బ్రతీకారమనఁగ నుపన్యాస మనఁగను,
సంయోగ మనఁగను సంధి యనఁగ,
సంతాన మనఁగను సంభిన్న మనఁగను,
నాదిషము నుపగ్రహంబు ననఁగ,

నెలయుపదియాఱు సంధుల విధుల నెఱిఁగి
దేశకాల పాత్రంబుల తెఱఁగు లెఱిఁగి
చతురుపాయంబుల నెఱింగి శక్తు లెఱిఁగి
నృపతి మెలఁగంగవలయుఁ దన్నెదిరి నెఱిఁగి.

బాలునితో, జరాభరునితో స్థిరదీర్ఘ
రోగితో బంధువిద్రోహితోడ
భీరునితో మహాభీరుసంగతునితో
లుబ్ధునితో లుబ్ధలోకుతోడ
బహుమంత్రగతునితో బహుశత్రుయుతునితో
నబలుతో దైవోపహతునితోడ
ముక్తభాగ్యునితో విరక్తుతో నతిప ఖా
సక్తుతో బ్రహ్మదూషకునితోడ
సత్యవర్జితుతో స్వదేశస్థుతోడఁ
ప్రబల దుర్భిక్షదుర్భరవ్యసనితోడ
దైవనిందకుతో సంధి ధరణిపతికి
సమ్మతముగాదు సమరంబె సంగతంబు.

ఘనతర విగ్రహంబు లప
కారకృతంబులు గాన రాజ్యవ
ర్ధనమును గోరి శోభన ప
రంపరఁ 'గోరి పరోపతాపభం
జనమును గోరి దుష్టరిపు
శిక్ష ఘటింపఁగఁగోరి ధీయుతుల్

జనపతి దేశకాలబల
సంగతి విగ్రహ మూనఁగాఁదగుఁ.
జ్ఞానము బలంబు పదము దేశంబు రాజ్య
మండలము రమణీజనమండలంబు
నపహరించుటచేత మదాభిమాన
కలనచే విధిచేత విగ్రహము గలుగు.
దేశద్రోహము బంధువి
నాశం బాప్తశక్తి నాశ మధర్మా
వేశము నేకార్థాభిని
వేశము దూషణము ప్రబల విగ్రహకరముల్.
పరుస నపరాధజనితంబు వాదజంబు
వాస్తుజంబు స్త్రీజంబు సపత్నజంబు
ననఁగ నేనుదెఱంగుల నడరుపగల
నణఁపఁదగు సాధనసహాయుఁడై నప్రభుఁడు.
సందిగ్ధఫల మతిస్వల్పఫలంబును
విఫలంబు పరిణామ వికృతఫలము
వర్తమానాపద్వివర్ధనంబును భవి
ష్యత్కాలదుర్దోష సంగతంబు
ప్రకృతనిష్ఫలమును బరనిమిత్తకమును
స్త్రీనిమిత్తకమును దీర్ఘతమము
అవిదితశత్రుబలాటోపము నకాల
భాగ్యబలోదత్తవైరియుతము

భావిఫలదంబు పరిణామ ఫలరహితము
ప్రకృతఫలము నాపాతవిపత్కరంబు
ననఁగఁ బదియాఱువిధములఁ దనరునట్టి
విగ్రహంబుల భూపతి విడువవలయు.

తత్కాలమునందు భవి
ష్యత్కాలమునందు శుభములై సఫలములౌ
సత్కార్యంబులనే సం
పత్కాముండైన రాజు సవరింపఁదగున్.

తనబలంబు సహాయసాధనసమృద్ధి
కలితమై, పరబల మట్లు గానియపు డ
హీనశక్తిత్రయోపేతుఁ డైనవిభుఁడు
మెలపుతో శత్రువుల నాక్రమింపవలయు.

మిత్రాక్రందాసారులు
శత్రుద్వేషులయి తనకు జయసాధకులై
మిత్రులయి భక్తు లగుచో
ధాత్రీపతి విగ్రహంబు తలపెట్టఁదగున్.

యానము విగ్రహపూర్వక
యానము సంధానపూర్వయాన ముపేక్షా
యానము ప్రసంగపూర్వక
యానము సంభావన మన నైదు తెఱంగుల్.

ఘను లగు రాజు లిర్వురకుఁ
గయ్యము కల్గినవేళ ద్వైధవ

ర్తనుఁ డయి కాకనేత్రగతిఁ
దా నవిలక్షితుఁడౌచు నెయ్యముం
జనవును సాయముం బలుకు
జాడనె చూపుచు వారు హీనతం
గనునెడ నం దుదారబల
గౌరవపక్షముఁ జేరఁగాఁ దగున్.
బలవంతులు బాధింపఁగ
నలయుచు మాఱొడ్డలేని యతఁ డుచితగతిన్
గులగుణయుతుఁ డగుమతియొక
బలవంతుని నాశ్రయించి పగ నీఁగఁదగున్.
దర్శనంబు సేత దగ్గఱ మెలఁగుట
మనసు ననుసరించి మసలుచుంట
చెప్పినట్టిపనులు చేయుచు నుండుట
యాశ్రితునిగుణంబు లండ్రు బుధులు.
ప్రభుసముత్సాహశక్తుఁడౌ భార్గవుండు
విబుధగురుమంత్రశక్తిచే నీఁగెఁ గాన
ననుపమంబైన శక్తిత్రయంబునందు
దీప్త మగుమంత్రశక్తియే దివ్యతమము.
పతి యనాప్తునితో నపండితునితోడఁ
గార్యగతుల విచారింపఁ గాదు గాన
నాప్తుఁ డగువాని విజ్ఞాని నరయవలయు.
గష్టపడక లభించునే యిష్టఫలము.

ఎఱుఁగనివిషయము లెఱుఁగుట
యెఱిఁగినవిషయముల నిశ్చయించుట సంది
గ్ధగుహ్యార్థము లెఱుఁగుట
పరిణామముఁ గనుట మంత్రశక్తికి ఫలముల్.

చతురోపాయము నాప
త్ప్రతికారము దేశకాలపాత్రవిభాగ
జ్ఞతయును సాహాయ్యము నభి
మతసాధన మనఁగ నివియె మంత్రాంగంబుల్.

కరణపాటవంబు ఘనసహాయోత్థాన
సంపదయును సుప్రసన్నతయును
బనులయందు శ్రద్ధఁ గనుటయు ననునివి
సులభ కార్యసిద్ధి సూచకములు.

కామవికారముచే సు
ద్దామమదముచేత ననవధానతచే ని
ద్రామోహితప్రలాపము
చే మంత్రబలంబు చెదరి చేటు ఘటిల్లున్.

సకలకర్మవేది శస్త్రశాస్త్రజ్ఞాని
స్మృతియుతప్రధాని చతురవాణి
సంతతప్రగల్భశాలియు నగువాఁడె
రాజునకును దగిన రాయబారి.

క్రమముగా నిసృష్టార్థి నాఁ గను మితార్థి
నాఁగ శాసనహారి యనంగఁ దనరి

కృత్యముల నేకపాదనికృష్టు లగుచు
వెలయుచుందురు నృపునిదూతలు త్రిభంగి.
తన్నుఁ దెలిసికొనక మున్న రినర పాలు
పురిని సభను జేరఁ బోవరాదు
కాలమునకు వేచి కార్యార్థి యగునాతఁ
డనుమతంబుఁ బడసి చనుట యొప్పు.
రూపవిచేష్టితములచే
జాపులచే నరినృపాలు సుముఖత్వంబున్
గోపము మైత్రియుఁ గోశము
లోపంబు బలంబు మది విలోకింపఁదగున్.
సభఁ బ్రవేశించి యుభయ పక్షముల వారి
నభినుతించుచుఁ దా సమయజ్ఞుఁ డగుచుఁ
దపసులును బ్రహ్మచారులు నుపవసించు
నట్టిచో నుండఁదగు దూత యైనవాఁడు.
స్వపరికాశు లనఁగ నప్రకాశు లనంగఁ
జరులు దోఁచుచుందు రిరు దెఱఁగుల;
చారుఁ డేగవలయు సాధువణిక్కార్ష
భిక్షుకాదివివిధ వేషకలన.
రాయబారంబు వమ్మయి పోయినపుడు
ప్రకృతిదుర్వ్యసనంబుచే బలవిహీనుఁ
డై నశత్రుభూపాలకు నాక్రమించి
బలము వెలయించి విజయంబుఁ బడయవలయు.

పౌరుషము నాఁగ మఱియు దైవంబునాఁగ
నిరుదెఱంగుల వ్యసనంబు లెసఁగుచుండు
నందు దుర్భిక్షజలమారికామయాగ్ని
జవ్యసనపంచకము దైవజంబు వత్స!
పడఁతిపొందు, పానపరత, ద్యూతాసక్తి,
వేఁటసంబరంబు విత్తనింద,
పలుకువాఁడి, దండపారుష్యమనెడు నీ
వ్యసనసప్తకంబు పౌరుషంబు.
శాంతికాదులచేఁ బౌరుషంబుచేత
నణఁపగాఁ దగు దైవజవ్యసనములను;
నయసముత్ధాపనమున నణఁపవలయుఁ
బౌరుషవ్యసనంబులఁ బార్థివుండు.
అరిజనభంజనంబు, వ్యయ
మాయము, మంత్రము, దండనీతియున్
నరపతిరక్షణంబు, వ్యస
నప్రతికారము, కార్యదీక్ష, బం
ధురతరమంత్రసిద్ధియు, న
నూనఫలాన్వితరాజ్యరక్షయున్
పరపరిణామవిజ్ఞతయు
నాఁజను నియ్యవి మంత్రికృత్యముల్.
అఖిలకార్యనిర్వాహకుం డగుప్రధాని
యాధిక దుర్వ్యసనాసక్తుఁ డయ్యెనేని

మంత్రిశక్తులతోడ సామ్రాజ్యలక్ష్మి క్ష
క్షీణతం గాంచు నశిచేసి శిశువుపోలె.
ధనకనకవస్త్రధాన్యవాహనచయంబు
ప్రజలమూలంబునని యలవడుఁ గాన
ప్రజలు దారుణవ్యసన విపన్నులైన,
వారివృత్తులతోడ సర్వము నశించు.
సామంతవ్యసనంబున
భూమీజనరక్షణంబు భూరిరణము, మి
త్రామిత్రపరిగ్రహ మపి
రామోదాసీనభావరతియు నశించున్
పరిజనభరణము, దానము
నరిమిత్రపరిగ్రహంబు నర్థవిభాగం
బురుదుర్గసంస్క్రియాలం
కరణములునశించుఁ గోశగతకోపమునన్
దండవ్యసనంబున రిపు
ఖండనమును దూరకార్యకరణంబు సుహృ
న్మండల రిపుమండల.భూ
మండలధనభృతియునాశముత్కృతియుఁజెడున్
పతిదుర్వ్యసనాసక్తిన్
బతితుండగునేని జెడును బటుతర రాష్ట్ర
చ్యుతికిన్ రాజ్యాంగవిని
ర్గతికినధోగతికి మూలకారణుఁడగుచున్

ద్వైధకారితయును దర్పాతిరేకంబు
ననవధానతయును నలసతయును
స్తంభ భావమునఁగ సచివవ్యసనపంచ
కంబువోలుచు విబుధ కథితమగుచు.

ప్రాకారయంత్రపరిఖా
నీకవిశీర్ణత్వశస్త్రనిచయాభావా
నీకక్షీణత్వము నన
శ్యామాకాంతకుమార! దుర్గజవ్యసనంబుల్.

దూరదేశసంస్థితమును దూషితమును
నప్రజితముఁ బ్రక్షిప్త మనాగ్జితమును
దుర్వ్యయీకృత మనఁగను దొడరువ్యసన
షట్కమును గోశజంబు నాఁ జనుఁ గుమార!

అవమాన ముపరోధము విమానచునువ్యాధి
శూన్యమూలత స్వామి శూన్యతయును
ప్రక్షేప మనృతంబు నిక్షిప్తతయు, శ్రాంతి
యూశాసమాసక్తి యగ్రతరత
భరణశూన్యతయును బ్రక్షీణతయు దూర
గమనంబును గళత్రగర్భతయుఁ గ
నంతర్విరోధంబు నభినవాగమనంబు
బ్రహతియు నిర్వేదభారయుక్తి.
కునృపపార్ష్ణిత్వమును భిన్నకూటతయును
స్వామిహీనత ప్రతిఘాతయుతియు ననఁగ

సహవాసియువాల్గున్యాయంబు లెఱుఁగవలయు
సైన్యజము లంచు ధారుణీశ్వరుఁడు వత్స!

దండ మసిద్ధసాధ్య మని
దండకఠోరతఁ జూపినేని దా
నండఁ దొలంగి భూప్రజ భ
యంబున శత్రున్నృపాళిఁ జేరు శ
త్రుండిటు లున్నతిం గనినఁ
దోన వినాశము గల్గుఁగావునన్
దండము యుక్తి సంగత ప
థంబున భూపతి దీర్పఁగాఁదగున్.

మానని వాక్పారుష్యము
చే నొచ్చినప్రజలవలనఁ జేటుఘటిల్లున్
బానవశంబునఁ గార్య
జ్ఞానవినాశమ్ము గలుగు జననాథునకున్.

అనియతమృగయారతిచే
ననర్థమగు నరిన్నృపాల హాని; ద్యూతరతిన్
ధనధర్మనాశనము జీ
వననాశము నగుటెకాక వైరముగలుగున్.

స్త్రీలోలత్వము చేత నృ
పాలమణికి నర్థధర్మభంగంబును మో
క్షాలోకభావశూన్యత
కాలాతిక్రమణదోషగతియు ఘటిల్లున్.

ధారుణీనాథుఁడు స్కంధా
వారనివేశజ్ఞుఁడగుచు వరసమయనిమి
త్తారంభజ్ఞుఁ డగుచో
వైరుల నిర్జించి విజయ వర్ధిష్ణుఁడగున్.
స్కంధావారము మధ్యభూమిని సకో
శక్షోణిభృద్గేహసం
బంధంబేర్పడఁ జేసి దానికిఁ జతు
ర్భాగంబులఁ సేనలన్
సంధానింపఁగ నొప్పు; దానికి సమం
తశ్శ్రేణి సేనాన్యప
స్కంధంబై యొకసేన కేలఁ దిరుగం
గా నొప్పు భద్రాప్తికిన్.
దూరప్రదేశచరులగు
చారుల మూలమున నృపుఁడు సర్వమెఱిఁగి ని
ర్ధారణమునఁ జేయందగు
నేరుపు మెఱయన్ బ్రవేశనిర్గమనంబుల్.
దానసామభేదదండజాలంబు లు
పేక్ష మాయ యనెడు నీయుపాయ
సప్తకంబు నెఱపఁ జను రాజున కసాధ్య
సాధనార్థమందు సముచితముగ.
నాఁడునాఁటికిఁ గనుచు నీ వాఁడసనుట,
మేలుదలసించి పలుకుట మెత్తనైన

పలుకుబడిఁ దేర్చు టొండొరుఁ గలిపికొనుట
యనెడునివి సామభేదంబు లంద్రుబుధులు.
తనసర్వస్వము నొసఁగుట
యును, దెచ్చికొనంగనూరకుండుట, ఋణము
క్తినిగను, టొరుఁజూపుట, నూ
తనవస్తువు లిచ్చుటయును దానవిధంబుల్.
ఒండొరులచెలిమిఁ జెఱుచుట
యొండొరువులలోన భేద మొదవించుటయున్
దండితనంబున నొరులం
బెండువడంజేయుటయును భేదవిధంబుల్.
వధ మొనర్చుటనఁగ వ్యధనుగూర్చుటనంగ
ధనము బలిమిఁజేసి కొనుట యనఁగఁ
దనరుమూఁడుగతుల దండక్రమంబుల
నెఱుఁగవలయుఁ బార్థివేశ్వరుండు.
ఉపనిషద్యోగమునఁ జేసి యుద్ధశాస్త్ర
శస్త్రచయములఁజేసి పైకొని శాత్రవులను
జంపఁదగు; సాధువులనెందుఁ జంపరాదు
వారి సామోక్తులనె తేర్ప వలయుఁ బతికి.
లలితకటాక్షంబులచే
నలరించి మనోధనంబు హరియించుచు ని
ర్మలవచనంబుల నమృతం
బొలికించుచు సామమూను టొప్పును బతికిన్.

కృతవైరి క్రుద్ధుండు హృతధనదారుండు
భూపాలవైరి యాశాపరుండు
అతికరుండు విమాని స్తుతిపరాయణుఁడును
నపగతధర్మకామార్థయుతుఁడు
అభిమానకలితుం డనర్థాభిశస్తుండు
పూజనార్హాప్రతి పూజితుండు
ఘనపరిభావి నిష్కారణత్యక్తుండు
శత్రుస్థితుఁడు నిత్యశంకితుండు
ననఁగఁదగువారి భేదింపఁ జనుట యొప్పు;
మానము, ప్రధానదానంబు, బహుమానభీప్ర
దర్శనము సామదృష్టి సంధాన మనఁగ
నలుదెఱఁగుల భేదంబు వెలయుచుండు.
కలితశక్తిత్రియుఁడు దేశకాలవిదుఁడు
నగు నృపతిదండమునఁ గొంప నగును రిపుల,
హితసహాయుండు గాని భూపతి నశించుఁ
జెదలుగొట్టిన వృక్షంబు చెడిన యట్లు.
అన్నంబుఁ గొనుట, పాన్పునఁ
బన్నుండుట, వాహనములపై నెక్కుటయున్
మున్నుగఁ బరిశీలింపక
యెన్నండును దగదు ధారుణీంద్రున కెందున్.
దీనజనుల సనాథల మానవతులఁ
గృపణులను వృద్ధులను దగు వృత్తులిచ్చి

వారిక్షేమంబు గనుచు ననారతంబు
రక్షణము సేయవలయు ధరావరుండు.
అని వెనుదిరుగమి, యుత్తమ
జనముల దానాదివిధుల సంతృప్తులుగా
నొనరించుట, భూజనరం
జనమును జనపతికి ముక్తి సోపానంబుల్.
ప్రభుండు మూలబలము భృతబలము శ్రేణి
బలము, మిత్రబలము, శత్రుబలము వన్య
బలము, ననునాఱుబలముల వరుసc దీర్చి
దైవమును గొల్చి పోరికిc దరల వలయు.
భేదింపరానిబలముల
భేదింపం గనుట శత్రుపృథ్వీపాలో
త్పాదనరతహితబల సం
పాదన మనునివియరధికబలకృత్యంబుల్.
వనతలదుర్గ వేశన మ
వంధ్యపురోగమనంబు భీప్రద
ర్శనమును భిన్నసైన్యగణ
సంగ్రహణంబు నభిన్నసైన్యభే
దనమును గోశరక్షణము
దర్శితశాత్రవసైన్యవర్తి భం
జనము వనంగనొప్పు నివి
సమ్మదసామజయూథకృత్యముల్.

అపస్వరంబుచేత ననుగమనంబుచే
శీఘ్రకార్యవిజయసిద్ధి గనుట
దీనజనుల నంటి తిరుగుట మొన సొచ్చి
కలఁచుటయునుదురగబలము పనులు.
నిరతాస్త్రధారణం బే
మఱియుండక పోవఁదగిన మార్గంబుల ని
బ్బరముగఁ బరిశీలించుచు
నరుగఁదగుఁ బదప్రచారులగు వీరభటుల్
చతురంగబలంబుల నే
గతి నెత్తఱి నెందు నడుపఁగాఁ దగునో త
ద్గతు లెల్ల నెఱిఁగి యాహవ
చతురుండై మెలఁగవలయు జనపతి వత్సా!
వ్యూహంబుల కెల్లఁ బ్రతి
వ్యూహంబులఁబన్న నెఱిఁగి యురుతరధైర్యో
త్సాహంబుల నాహవ స
న్నాహంబులనృపుఁడు మాఱ్కొనందగు రిపునిన్.
అస్త్రవిధుల నెఱిఁగి శస్త్రరీతు లెఱింగి
పరవ నెఱిఁగి మరలుపఁగ నెఱింగి
పరునిచేత లెఱిఁగి ప్రతికరించు టెఱింగి
పోర నెఱుఁగవలయు వీరవరుఁడు.
తేటి చూడఁగరాని తేజుచే దినరాజు
దండనయంబుచే ధర్మరాజు

చూపులఁ దనియించు సొగసుచే రేరాజు
ప్రచురధనంబుచే రాజరాజు
కదిసి మార్తుర నొంచు కడిమిచే మృగరాజు
నచలభావంబుచే నద్రిరాజు
నెఱిమించుపలుకుల నేర్పుచే ఫణిరాజు
దివ్యభోగంబుచే దివిజరాజు
నై ప్రజాభరణంబుచే నవనిఁ బోలి
శక్తిసంపత్తిచే నాదిశక్తిఁ బోలి
విశ్వజనరక్షచే మహావిష్ణుఁ బోలి
వసుధఁ దోఁచు ప్రత్యక్షదైవంబె రాజు.

జనులకు ననుకూలము లగు
పనుల నొనర్చుచును గానిపనుల నుడుగుచున్
జనపతి శ్రీ భూమండల
జనానురాగములఁ బడయఁజను భద్రతకున్.

దానముచేఁ బ్రలోభులను
దండనయంబున దుష్టులన్, ప్రసం
తానము సామమార్గమున,
దండభయంబులచే విరక్త భూ
జానుల యోధులన్ గహన
చారులఁ జోరుల దుర్విచారులన్
మానవనాథశేఖరుఁడు
మానుగ వశ్యులఁ జేసికొందగున్.

శమము, దమ, మహింస, శాంతివిజ్ఞానంబు
దయయు, సత్యము నాఁగఁ దనరుచుండు
పూవులెనిమిదింట దేవదేవుని భూమి
నాయకుండు పూజ సేయవలయు.

ధ్యానముచేత సంస్తుతివి
ధానముచేతఁ బవిత్రచిత్తసం
ధానముచేత శ్రీచరణ
తామరసామృతమాధురీఝరీ
స్నానముచేతఁ బ్రేమమయ
సంస్మరణోదిత సమ్మదాశ్రు సం
తానముచేత మంగళని
ధానుని దేవునిఁ గొల్వఁగాఁదగున్.

ఈదృశరాజనీతిని ది
నేశ్వరవంశవిభూషణుండు సం
పాదితకీర్తిశాలి జన
పాలశిరోమణి రామచంద్రుఁ డ
త్యాదర మొప్ప లక్ష్మణున
కానతి యీయ సుమిత్రసూతియున్,
మోదము నొంది యభ్యుదయ
మున్ గనియెన్ సుగుణాభిరాముఁడై.

రాముని గుణసంతానా
రాముని నయ మధురవచనరచన లెఱిఁగి శ్రీ

రాముఁడవై శుభంగదభి
రాముఁడవై మెలఁగుమయ్య! రాజకుమారా!

*　　　　　*

అంకితమిచ్చె సీతికృతి
యయ్యకుఁ జిన్నప్ప దర్థపద్ధతుల్
సంకలనంబు సేసి యొకఁ
సత్కవి; యయ్యకుఁబోలె నీవు నీ
వేంకటపార్వతీశ్వరక
విద్వయ మిప్పు డొసంగె శారదా
కంకణకింకిణీమధుర
గానసుధారసమూర్తి మత్కృతిన్,

# పు ష్ప నా ట క ము

క్షణము లోనె సుఖంబుఁ గష్టమ్ముఁ గూర్చి
క్షణములోనె భవమ్ము నాశమ్ముఁ గూర్చి
క్షణములో నెన్నియో నాటకములఁ గూర్చు
కపటనటరాజునకు నమస్కారశతము.

*　　　　*

ప్రదేశము— పుష్పోద్యానము

ప్రవేశము — పుష్పసుందరులు — వర్ష బిందువు.

యూధిక:— రమ్ము రమ్ము! ప్రాణేశ్వరా! రమ్ము! నా హృదయ మధ్యమునఁ బ్రవేశింపుము! నా హృదయమును బరిపూర్ణముగఁ జేయుము! ఎంత కాలమునుండి నేను నీయందలి యాశచే నుత్కంఠనై యెదురు చూచుచుంటినో నీ వెఱుఁగవా! నేను మొగ్గనై యున్నప్పు డీమహాగ్నిచక్రము— ఈభువనసంతాపక మహాపాపము— పూర్వాకాశమునం దెచ్చటనో యొకచోటఁ బడియుండెను. అప్పటి కది యింతటి విశ్వవిధ్వంసమూర్తియై యుండ లేదు. అప్పటి దాని తేజమంతటి జ్వాలాభీలమై యుండ లేదు. అయ్యో! అది యెంతకాలము! చూడుము! క్రమముగా నామహాపాపతాపమూర్తి గగనమండలమధ్యస్థలమునఁ బ్రవేశించి బ్రహ్మాండమంతయును బ్రజ్వలితముగఁ జేయుచుఁ

పశ్చిమాకాశమున కొఱఁగిఱిగి తుద కాయ
నంతసాగరమున విలీనమైపోయెను! పోనిమ్ము!
దూరమై పోనిమ్ము!—కాని ప్రాణనాథా! ఇన్నా
ళ్ళవఱకు నీ వెచ్చట నుంటివి? అయ్యో! నేలపైఁ
గాలుంచెదవు సుమా! నీవు నాహృదయమున
నిలిచినచో నాజ్వాలామయతపనమూర్తి యుఁక
నన్ను డికింపఁ జాలఁడు! మఱియు నిన్నుఁ గూడ
బాగుగ నలంకరించును. ఆ రౌద్రకిరణప్రపంచ
మున మనోజ్ఞరత్న భూషణాలంకృతమూర్తింబోలి
యున్న నీతోఁగలసి నేనును మనోజ్ఞమూర్తి
నయ్యెదను. రమ్ము-రమ్ము! నా యుల్లమును జల్లగఁ
జేయుము. నాహృదయ మధ్యమునందే ప్రవేశిం
పుము. క్రిందఁ గాలుంపవలదు!

నందివర్ధని:— (జనాంతికముగాఁ గృష్ణకళికంగాంచి)
సోదరీ! ఈబిడ్డ యవస్థం జూడుము!

కృష్ణ:—ఏబిడ్డ?

నంది:—ఈమన యూధిక. ఇంతవఱకు నీమె మొగ
ముబిగించుకొన్ని, తలవంచుకొని యంగడిలోని
మూటవలెఁ బడియుండెను. ఇంతలో నాకాశము
నుండి వర్షబిందువు యువరాజువలె గాలిగుఱ్ఱము
పై నెక్కి వచ్చి యీమె తలవాకిటఁ బ్రవేశిం
చెను. తోడనే యీకన్యక హాసవికసితవదనము

తో నాతని నాక్రమించినది. ఏమి దాని పసుపుఁ దనము! పసుపువాండ్ర పద్ధతియే స్వతంత్ర మైనది!

కృష్ణ:—సిగ్గు సిగ్గు!

నంది:—కాని, సోదరీ! మనము మాత్రము వికసించుట యెఱుఁగమా? సంసారమును జేసికొనవలసి వచ్చినప్పుడు దినదినమును, మధ్యాహ్నమునను, దీవ్రాతపమునను, శిశిరమునుగూడ వికసింపవలసియే యుండును! వికసింపకున్నచో సంసారము సాగుట యెట్లు? మనకుమాత్రము వయసు లేదా? వాంఛ లేదా? కాని, యింతటి యహంకారగర్వము మన మెఱుఁగుదుమా?

కృష్ణ:—ఆమాట నిజమే!

యూధి:—ప్రాణప్రియా! ఇంతకాల మెచ్చట నుంటివి? నీవు లేకుండ నేనొక నిమిషమైన నిలువఁ జాల నని యెఱుఁగవా?

వర్ష బిందువు:—ప్రాణేశ్వరీ! విచారింపకుము! చాల కాలమునుండి రావలయుననియే ప్రయత్నించుచుంటిని. సమయము దొరకలేదు. ఆకాశము నుండి భూమి మీఁదికి వచ్చుట సామాన్యమా? నడుమ నెన్ని యంతరాయములుండునో నీవు మాత్ర మెఱుఁగవా? ఒంటిగా వచ్చుట కవ

కాశము లేదు. సుంపులతోఁ గలసి రావలయును. అన్ని సమయముల యందు నందలి స్థితిగతులు నొక్కరీతిగా నుండవు గదా! కొందఱు తాఁ గొప్పవారమనుకొని యాకాశమునందలి యున్న తాంతరము నందదృశ్యులై యుండుటకై బాష్ప రూపమునే గోరుకొనుచుందురు. వాయునిమ్న స్తర మిప్పుడు తాపముగా నున్నది గావున నచ్చటికిఁ బోయినచో శుష్కించి పోవుదుమని కొందఱు హిమాకృతిని వాంఛించు చుందురు. అవనికి దిగుట యధఃపతన మగుసుగావున మన మట్టిల పోవలయునని కొంద అనుచుందురు. క్రిందికిఁ జోవుటవలన లాభము లేదనియు, నాక సమునఁ గాలాంబుదములమై చిరకాల ముంద మనియుఁ గొంద అనుచుందురు. నదీనిర్ఝరిణులమై లవణసముద్రమునఁ బడిపోవుటకంటెఁ బ్రచండాతపమున విహరించుచు నందఱ మొక్కటియై యింద్ర ధనుర్మూర్తిం దాల్చినచో భూచరులును, ఖేచరులును మనలను గాంచి మోహితులై పోవుచుందురని కొందఱనుచుందురు. మన మిచ్చటనే యుండి కాళిమామయ కరాళ కాదంబినీమూర్తిం దాల్చి, విద్యున్మాలికలఁ గంఠహారములుగఁ జేసికొని మన సౌందర్యమును బ్రకా

శిలపఁ జేసికొంద మనికొంద అనుచుందురు. జల వంశజుల మగు మనము భూలోక సముద్ధరణ మునకై యూరక యే త్తరపడిపోవుటయేల? ఆహ్వానము రానిండని కొంద అనుచుందురు. కొందఱు విద్యుల్లీ లలం గాంచుచు, నీ మేఘము నొడిలోఁ గొంత సేపును, ఆమేఘము నొడిలోఁ గొంత సేపును, ఆకాశప్రాంతమునం దొకప్పుడును, ఆకాశమధ్య భాగమునం దొకప్పుడును గ్రీడించుచు—

యూధి:— ఆ విద్యుల్లతయందే నీ కంతటి ప్రేమ యున్నచో నిచ్చటి కేలవచ్చితివి? అచ్చటనే యుండఁగూడదా? ఆమె యెదుట నే నెంతటి దానను?

వర్ష:— సరి సరి! అంతకోపమేల? నే నట్టి వాఁడ ననుకొంటివా? చిన్న వాండ్రగునట్టి యుఱ్ఱు లెవ్వారు నిచ్చటికి రానే లేదు. మే మెంతగొప్ప వార మనుకొన్నావు! అటనుండఁ జాలక దిగి వచ్చితిమి. చాలదినములనుండి నిన్నుఁ జూడవల యునని యున్నది.

పద్మిని:—(పుష్కరిణి యందుండి) ఓ హోహో!. నీవు గొప్పవాఁడవా? ఎంతవాఁడవు! నీవంటి వారినిఁ బది లక్షల మందిని, ఒక్క నాపత్రమునందు నిలిపి యుంచఁగలను. రారాదా?

వృ:—వత్సా! అసలు సంగతి మఱచిపోయితివా యేమి? ఈ పుష్కరిణిని బాలించువా రెవ్వరు? ఓపంకజా! వర్షమే లేకున్న చో ఒగంబునఁ బంక మెక్కడ నుండును? జల మెక్కడ నుండును? ఇఁక నీ వీఁదుట యెక్కడ? నవ్వుట యెక్కడ? ఓ జలజా! నీవు మా యింటి యాఁడుబిడ్డవు కావు గనే నిన్ను మేమొడిసిఁ జేర్చుకొని పాలించుచు న్నాము—కాకున్నచో నీకీ రూపమెక్కడిది? ఈ నివాససుఖ మెక్కడిది? ఇంతటి గర్వ మెక్క డిది? పాపాత్మురాలా! నీ పితృకుల విరోధియగు నయ్యాగ్నేయ స్వరూపునిఁ బ్రేమించుచున్నావు! నీకు బుద్ధిలేదా?

యూథి:—ప్రాణేశ్వరా! సిగ్గు సిగ్గు! ఆ యవ్వతో నన్ని మాట లేల? ఆమె ప్రొద్దుటినుండియు మొగమెత్తి యగ్నినయుండగు నాయకుని వంక నే తదేకదృష్టిం గాంచుచు సిగ్గులేకుండ నాతఁడే వంకకుఁ దిరిగిన నావంకకు నోరు తెఱచుకొని నిరీక్షించు చున్నది. ఎంత పరాకు! ఈనడుమ నెన్నియో కణుదుటీఁగలు, తుమ్మెదలు, తేనె టీఁగలు—ఎన్నెన్ని వచ్చిపోవుచున్నను దీనికి సిగ్గులే కున్నది!

కృష్ణ:—అదియేమే యూధికా! అట్లనుచున్నావు!
తుమ్మెదలగోడప యింటింట నున్నదియేకాదఁటే?
యూధి:—సోదరీ! మాయింటి మాట చెప్పుము!
నేనిప్పుడే కన్నుఁ దెఱచితిని. నే నీతుమ్మెదల
బాధయెఱుఁగ నమ్మా!
వర్ష:—యూధీ! లజ్జావిహీనులగు వారితో నీ కీ
సంభాషణ మేల? ఆ కళంకినులు నీవిమలధవళ
శోభ సౌరభములం గాంచి సహింపఁగలరా?
పద్మి:—ఓరి క్షుద్రుఁడా! నీకుఁ దగినట్లు మాటాడు
చున్నావు! అదిగో-మహాబలుఁడు వచ్చుచున్నాఁ
డులే!
యూధి:—అయ్యో! అదియేమి?
వర్ష:—ఔను. ఇఁక నేనుండుట కవకాశము లేదు.
యూధి:—ఉండవా?
వర్ష:—ఉండఁజాలను. ఆ మహాబలుఁడు నన్నుండ
నీయఁడు! నేనాతని నెదిరింపఁజాలను.
యూధి:—అయ్యో! జీవితేశా! ఇంచుక నేపాఁగఁ
జాలవా?

(వాయువు ప్రవేశించును.)

వాయు:—(వర్షబిందుపుంం గాంచి) దిగు!
వర్ష:—ఏమి మహాత్మా!

వాయు:— నేనీయనంగ కమలసుకోలను నాసీత ప్రఫుల్ల యూధికాకళికం గైకొని వినోదించెదను. నీవల్పుం డవు; అధఃపతితుండవు; నీచగామివి; నీచ వంశో జుండవు; నీవా యీసుఖాసీనమునం దుండుట? దిగు!

వర్ష:—నే నాకాశమునుండి వచ్చితిని!

వాయు:— నీ వల్పపాపార్ద్ర వజీవివి! నీచగామివి! పోయి యే నెరియలోనో, యే బొరియలోనో దాంగికొనుము. దిగు!

వర్ష:—యూథికా! ప్రేయసీ! ఇంక నేను పోవుదునా?

యూధి:—ప్రాణేశ్వరా! ఉండవా?

వర్ష:—ఉండ నిచ్చుట లేదు.

యూధి:—ఉండవా? ఉండవా? ఉండవా?

వాయు:—యూధీ! నీ కంత తలత్రిప్పెందులకు?

యూధి:—మహాబలా! దయయుంచి నీవు పొమ్ము.

వాయు:—సుందరీ! నేను నీకొఱకే వచ్చితిని.

(యూధిక వణంకుచుం బాఱిపోవం బ్రయత్నించును)

వర్ష:—ఈ గందరగోళములో నే నింక నిలువం జాలను.

యూధి:—నాథా! అట్లయినచో నాకున్న యీ యించుక సంపత్తిని నీకె సమర్పించెదను. తీసి కొని పొమ్ము!

వర్ష:—నీయొద్ద నేమున్నది?

యూథి:—ఇంచుక మధు వున్నది. కొంచెము పరిమళ మున్నది.

వాయు:—పరిమళమును నేను గైకొందును- అందుకొఱకే నేను వచ్చితిని!

(అని వాయువు బలవంత పెట్టును.)

యూథి:—(వర్ష బిందువుం గాంచి) ప్రాణేశ్వరా! నీవు పొమ్ము- ఈ దస్యునిఁ జూచుట లేదా?

వర్ష:—హృదయేశ్వరి! నిన్ను విడిచి నేనెట్లు పోఁగలను! కాని యీ అనిల బలప్రయోగమున నిలువఁజాలకున్నాను పోవుచున్నాను-పోయెదను-

(వర్ష బిందువు భూమిపైఁ బడును.)

నంది, కృష్ణ:—అయ్యో పని యైనది! ఆకాశమునుండి యూడి పడినాఁడుగా! ఆ! ఇప్పుడేమైనది? అధోలోక గతియైనది! కథావశేష మయినది!

యూథి:—(వాయువుతో) వదలుము- వదలుము.

వాయు:—వదలుట యేల? లెమ్ము-పరిమళమును నాకిమ్ము!

యూథి:—అయ్యో! ప్రాణేశ్వరా! నీవెక్కడ నున్నావు? అమలుఁడవును, కోమలుఁడవును, స్వచ్ఛస్వరూపుఁడవును, సుందరుఁడవును, సూర్యప్రతిఘాతుఁడవు నగు నో రసమయ! జలకణ మూర్తీ!

నీ వెక్కడకుఁ బోయితివి? ఓ జీవితేశ్వరా! ఈ హృదయమును స్నేహప్రపూర్ణముగఁ జేసి మరల నేల శూన్యముగఁ జేసి వైచితివి? ఒకసారి దర్శన మిచ్చి యానందముం గూర్చి మరల నెక్కడ దాఁగితివి? ఎందుఁ గ్రుంగితివి? ప్రాణాధికా! నేను నీతోఁగూడ నేలరాఁ జాలనైతిని? నీతో నేల మరణింప నైతిని? అనాథంబును, నస్నిగ్ధంబును నగు నీపుష్పదేహముం దాల్చి యీశూన్య ప్రదేశమున నేనేల జీవించి యుంటిని?

వాయు:—ఈ వేడుకలు గట్టిపెట్టుము! పరిమళమిమ్ము.

యూథి:—వదలుము! వదలకున్నచో నేను నా ప్రాణేశ్వరుని మార్గమునే పట్టిపోయెదను.

వాయు:—పోయినఁ బొమ్ము - పరిమళ మిమ్ము హుం.

యూథి:—హా! చచ్చితిని! చచ్చితిని!

వాయు:—హుం!

(యూథిక వృంతచ్యుతయై క్రిందఁబడును.)

వాయు:—హుం-అహో! అహో!

(తెరపడును.)

ఉపసంహారము:

ప్రథమశ్రోత:—ఈనాటకమేమి యుద్దేశించెను?

ద్వితీయుడు:—ఇందు యథార్థ నాయిక-నష్టబం
ధువు నాయకుడు! ఓహో! ఏమినాటకము!

తృతీయ:—అయినఁ గావచ్చును. ఇందొక నీతి
యుండుటచే నీతికథయని చెప్పవచ్చును!

చతుర్థ:—అట్లు కాదు-ఇది యొక విధమగు విషా
దాంత నాటకము.

పంచమ:—కాదు-ఇది యొక ప్రహసనము.

షష్ట:—ప్రహసనమునుఁ గాదు-అన్యాపదేశ దూష
ణము. ఎవ్వరినో మనసునందుంచుకొని యాక్షే
పించి నట్లున్నది.

సప్తమ:—అదికాదు-దీనికి గూఢార్థ మున్నది. ఇది
పరమార్థవిషయిక కావ్యమని నాకుఁ దోఁచు
చున్నది. "కాంక్ష"యని గాని, "తృష్ణ" యని
గాని దీనికిఁ బేరుంచినచో బాగుగనుండును.
గ్రంథకారుఁ డంతవఱకాలోచింపలేదు.

అష్టమ:—ఇది యొక రూపక మనుట సత్యము.
దీనికి నేనర్థము చెప్పుదునా?

ప్రథ:—దీని యభిప్రాయము గ్రంథకర్త యేల
చెప్పరాదు?

గ్రంథకర్త:—ఇది మీరు చెప్పినదానిలో నేదియునుఁ గాదు. ఈగ్రంథమునకు నైనను యాంగ్లేయభాషా నామధేయమునుఁ దలఁచితిని.

"A true and faithful account of a lamentable Tragedy which occurred in a flowerpot on the evening of the 19th July, 1885, Sunday, and of which the writer was an eye-witness."

# ప్ర ణ య ప త్త్రి క లు

(వీనికి జీవసూత్రములు పదునెనిమిది)

౧. ప్రణయపత్త్రిక లన్న నొకరు వ్రాసిన వని గాని, ఒకరి కొకరు వ్రాసికొన్న వని గాని భావించుకో రాదు.

౨. ప్రణయపత్త్రిక యన్న ప్రేయసీ ప్రేమభావ పత్త్రిక యనియు, ప్రేమిక ప్రేమభావ పత్త్రిక యనియు గ్రహించినఁ జాలును.

౩. పత్త్రికలన్న వారపత్త్రికలును, పక్షపత్త్రికలును గావు. ప్రేమభావపత్త్రములను వహించినపక్షు లని మనవి.

౪. పూర్వము మన ప్రబంధములలో నాయికా నాయకుల నడుమఁ బ్రణయపత్త్రికలు మోసిన పక్షుల వంటి వీ పక్షులు కావని తెలిసికో వలెను.

౫. ప్రేయసి పేరు సారి; ఆమెభావసఖి పేరు శారి; సారి క్లిష్టముగా శారి. మాటాడుచుండును. శారి మాటలలో సారి నడుమచుండును.

౬. ప్రేమకుని పేరు హారి; అతని భావసఖి పేరు కీరి; హారికిఁ దోఁచినదే కీరి పలుకుచుండును.

౭. పూర్వ మెప్పుడో కలిసికొని యున్నారు గాని, మనకథలో సారి, హారి కలిసి కోరు. శారి, కీరియూ

త్రము కలిసికొని వారిలాగు తలపోసికొనుచుందురు.

౮. సారి హారి పక్షమున, శారి కీరి మాటాడు కొనుచు వచ్చినవే ప్రణయపత్రిక లైనవి.

౯. సారి రాజకుమారియుఁ గాదు; హారి రాజ కుమారుఁడును గాఁడు.

౧౦. దేవరాజు వారి నొకప్పుడు చేరఁదీసి పెంచను లేదు; ఇప్పుడు విడఁ దీయను లేదు.

౧౧. పూర్వజన్మము నందు వారు ప్రేమికులై యిప్పుడు దంపతులు కాఁదలఁచు కొన్నారో-అప్పుడు దంపతులై యిప్పుడు ప్రేమికులై యుండఁదలచుకొన్నారో యింకను నిశ్చయింపఁ బడలేదు.

౧౨. కీరికి-పాలు, మీఁగడ, పండ్లు, పంచదార యిష్టము.

౧౩. శారికి పకోడీలు, పులి(యా)హారము, మసాలాకూరలు ఇష్టము.

౧౪. కీరి తియ్యని మాటలలోఁ గూర మున్నది-శారి కారపుఁ బలుకులలోఁ గమ్మఁ దన మున్నది.

౧౫. అందువల్ల, తీపిలో వెగటు మెత్తుటగాని, కారములో వికార మెత్తుటగాని లేదనుకొ వల్లఁగాదు.

౧౬. కీరికి కారమన్న చోఁ గళ్లవెంట నీళ్ళువచ్చును. శారికి పాలన్నచో ఒడలు నీరసించుచుండును.

అవి ఆనందసూచకములనియు-ఇవి సాత్త్విక భావ చిహ్నములనియు గ్రహించుచుండవలెను.

౧౭. కీరికి శారికి దేశకాలపాత్ర వివక్షత లేదు. ఇష్టపడి నప్పుడవి యెగురఁ గలవు; ఇష్టమైన పదార్థములు గ్రహింపఁ గలవు; కామరూపము లెత్తఁ గలవు; కావలసిన చోటికిఁ బోఁగలవు; ప్రణయములోఁ బ్రపంచమంతయుఁ బాడఁ గలవు.

౧౮. అట్టి శారి కీరికి, సారి హారికి జీవసూత్రములు. సారి హారి అట్టి భావపక్షులను (తిర్యగ్జంతువులను) పెట్టుకొని మాటలాడుకొనుటయు, తమ తమ ప్రేమలు వెల్లడించుకొనుటయు వివేకశూన్యతయో, విజ్ఞానధన్యతయో - యనుభవజ్ఞులగువారే నిర్ణయించుకొనవలెను.

(గున్నమామిడికొమ్మమీఁద కీరి, గూఁటి గుమ్మములో శారి కూర్చుండి, కొసరికొసరి మాటాడుకొనుచున్న వి-సారి హారిమాటలుగ)

౧

కీరి:— సారీ! అప్పటికి-నీగూఁటి మెట్లపై నిన్ను మొదట చూచినప్పటికి-నాకుఁ బ్రేమ యున్న నేమియో తెలియదు. తళుకుతళుకు మని మెఱసి పోవుచున్న నీకన్నులలో నది నిండి యున్నది

కాఁబోలు! అప్పుడు నీచూపులతో నాకు "ఇంజక్షను" ఇచ్చినావు. నాచూపులు నీచూపులతోఁ గలసికోఁ గలిగినవో లేదో నేనెఱుఁగను. అప్పుడు నీ కన్నుల నిండియున్న ప్రేమరసము నాచూపులలో నిండిపోయినది-నా హృదయములో పొంగిపోయినది-నా శరీరమంతయు విరిసిపోయినది. అది అమృతమో, విషమో, యిప్పటికిని నేను గ్రహింపలేకుండ నున్నాను. ఎందుకన-అమృతమైనచో నాహృదయములో అంత బాధ యెందుకు? అమృతమయమైన యాహార మమితమైనప్పుడు విషమౌ నని విని యున్నాను. నా కది యెక్కువై విషమైనదో-నిజముగా నది విషమో యిప్పటికి గ్రహింప లేకుండ బాధపడుచున్నాను. విషమునకు విషమే విఱుగుడు కావున నీచూపులతో నీవుమరల 'ఇంజక్షను' ఇచ్చి యీబాధ తగ్గింతువని నాయాశ. అట్టి యాశమీఁదనే జీవులందఱును జీవించుచున్నారనియును, ప్రపంచమంతయు నడుచుచున్నదనియును ఆనాఁడు నీ చూపులవల్ల నేను గ్రహింపఁగలిగితిని. అది-నా ఆశ-ఏమందువు సారీ!

శారి:—(నిట్టూర్పు విడిచి) నామనోహరీ! నా మొదటిసారి, నా తుదిసారి-ఆనాఁడు నిన్నుఁజూచి

నప్పుడే నాకన్నులలో ఆజీవకళలు-అప్రణయ కళలు-అప్రయత్నముగా స్ఫురించినవి. వానిని, ఆనాఁడే పరశురాముని శక్తినంతను ధనుస్సుతోఁ గూడ లాగివేసిన శ్రీరామునివలె నీమోహన కటాక్షమాలికలతో లాగివేసినావు-ప్రాణము లతో పాటు.-ఇఁక నాలో నేమున్నది? ఒంటి ప్రాణముతో ఆరూపు కన్నులలోఁ బెట్టుకొని యున్నాను. కాని, ఇంక నీజన్మమున మఱల నంతటి సౌభాగ్యనిముషము వచ్చునా?-ఆ యాశ లేదు. ఈ నిర్బంధజీవితమునకు, నీవు సుఖముగా నుండుటయే నామొదటి యాశ-తుది యాశ కూడను.

కిరి:—ఆశ లంతరించుట చేతనే యంధకారము ఘనీభవించినది. కన్నులకే శామ-ఘనసునకును మబ్బు గ్రమ్మినది. నన్ను నేనెఱుఁగను-కాని నీకోసమే నాప్రాణములు చీఁకటిలోఁ బడిపోయినవి. అప్పుడు నీవెక్కడ నున్నావు? నాకోడ నున్నావా? నాలో నేనే వెదకికొంటిని. నిజముగా నాయొద్ద నీవు లేవని, నాదానవు కావని, నేననుకొనఁ గలిగినచో, నా పాదములక్రింది భూమి జాఱిపోవుచున్న దేమి?-ఆకాశవీధిలో నాయొడలు తిరిగిపోవుచున్న దేమి?

శారి:—ఆఁగు మాఁగుము-ఆఁగుము. అంతకంటెఁ పైకిఁ గాని, క్రిందకిఁగాని తిరిగిపోకుము. కన్నులు మూసికొని నామూర్తిలోని వెలుఁగును బట్టుకొనుము. నేను నీదాననే-ఎప్పటికిని నీదాననే-నేను నీదానను గాక నాదాననైనప్పుడు నీకీ త్రిప్పులతోఁ బనిలేదు. నీవు నావాఁడవౌనో కాదో ఆకాశమున కెగిరిపోకుండ నిల్చియున్నచో, నేను నామనసులోనే నిన్నుఁ జూచుకోఁ గలుగుదును. నీవు నావాఁడవు కానిచో-అంతమాట నే ననఁ జాలను-నేనిఁక లేనిదాననే-ఈ జగదంతరాళములో నేనులేని దాననే.

కిరి:—లేని దానవా? నీవు లేని దానవా శారీ! ఈజగత్తులో నేను నీకోసమే-నీ మూర్తికోసమే వెదకికొను చున్నాను గదా! నీ వున్నట్టుగానే వెదకికొనుచున్నాను గదా! నీమూర్తిని, నీసుందరమూర్తిని పువ్వులలోఁ జూచికొనుటకై, నీ నిట్టూర్పులను నెత్తావులలో గ్రహించుటకై, నీచక్కని పలుకులను తరుపత్రమర్మరధ్వనులలో వినుటకై తిరిగిపోవు చున్నాను గదా! నీవు లేని దానవా శారీ! నీవు నేను చూచిన చోటనే, నేను చూచినట్టుగనే యుంటివని వెదకికొనుచున్నానే!

నీవు లేని దానన-! ఇంక నేనెవరికై వెదకుదును! ఎవరికై జీవింతును!

శారి:—హరీ! నీవు నీకై జీవింపుము. నీసుఖమునకై నేను జీవించియుంటి ననుకొని జీవింపుము. నీ తలంపులలో నేను జీవించియుండుటయే కోరుకొందును. జన్మ జన్మములకు నాకంతియే చాలును. అప్పుడు నేనున్నాను. అప్పుడు నేను నీచెంతనేయున్నాను-అట్లు కానిచో-నా కోసము నీవు కష్టపడుచున్నచో నేను లేనట్లే-ముమ్మాటికిని లేనట్లే.

కీరి:—సారీ! నాప్రాణప్రియా! నీవు లేనట్లేనా? నేను నిన్నుఁ బ్రేమించుచున్నానే! లేని నిన్ను నే నెట్లు ప్రేమింపఁ గలుగుచున్నాను! నీవున్నావు, నిజముగానాకొఱకు-నాప్రేమకొఱకు నీవున్నావు. కాని నీ ప్రేమకొఱకు-నన్ను నీవు ప్రేమించుటకొఱకు నీవున్నావో లేదో-అందుకనియే నిన్ను నేను ఈజగత్తులో వెదకికొనుచున్నాను.

శారి:—ప్రియా! నన్ను నీవు ప్రేమించుచున్నావా!-ఎంత సుఖము! నేనెంత సుఖము ననుభవించుచున్నాను!-ఈమాట వినుటకొఱకే నేనుజీవించియున్నాను. ఇప్పుడు నిన్ను నేను నీయింటనే కాదు-నాయింటను, నీకంటనే కాదు-నాకంటను, నీభావమునందే కాదు-నాభావమునందును, నాకే

మునం దే కాదు-నక్షత్రము లందును, అవనీ తలమునం దే కాదు-అపగాపథుల యందును, అని లమునం దే కాదు-అణ్వంతరాళముల యందును, అన్నిటి యందును చూడఁగలను. సుఖపడఁ గలను. ఎంత సుఖము!-నే నెంత సుఖము ననుభ వించుచున్నాను. ప్రేమించుటలో నెంత సుఖ మున్నది! ప్రేమలో నెంత నిత్యత్వమున్నది! ప్రభూ! నేనున్నాను. నీకోసమే నేనున్నాను. నీ ప్రేమకోసమే నేనున్నాను.

కిరి:—నా ప్రాణసఖీ! అవును నీ వున్నావు. నా ప్రేమ జగత్తులో నీవున్నావు-జడజగత్తులో నీ సుందర ముఖము నాకుఁ గానఁబడకున్నచో, చంద్రుని పాలంభించి యుపాలంభించి ముద్దుపెట్టుకొనఁ జూచుట యెందులకు? నీ మనోహరాక్షులు నా కగపడకున్నచో, పద్మములను పట్టి పల్లార్చిపల్లార్చి అల్లారుముద్దుగాఁ జూచికొనఁ జూచుట యెందు లకు? నీమధురసంభాషణము వీనులవిందుగా వినఁ బడకున్నచో, విహంగకలకలారావములను విమ ర్శించి విమర్శించి, విమలామృతవీచికలుగా వినో దింపఁ జూచుట యెందులకు?-నీమనోజ్ఞమూర్తి కానఁబడకున్నచో, కమనీయకుసుమవల్లికలను

కౌఁగిలించి, గారవింపఁ జూచుట యెందులకు?
సఖీ! అవును నా ప్రేమజగత్తులో నీవున్నావు.

శారి:—నా మనోహారీ! అవును. నీప్రేమ ప్రబంధ
జగత్తులో నేనున్నా నని యిప్పటికిఁ దెలిసికొన్నాను.
నీ సౌఖ్యమయప్రేమ ప్రబంధజగత్తులో నేనున్నా నని
తెలిసికొన్నాను. నిజముగా నీ ప్రేమమందిరము
లో నేనున్నాను. నా ప్రేమమందిరములో నీవు
న్నావు మనప్రేమమయాభావనాజగత్తులో మన
మున్నాము. కాని—కాని... పరితాపమింకను
మిగులుచున్న దెందుకు? ఔను-పరితాపమునం
దే-ఈ ప్రణయవిరహపరితాపమునందే పరమానం
దముకలదని స్వానుభవముచే బోధ యగుచు
న్నది. ప్రణయమయజీవితమునకుఁ బరమా
ధారము పరితాపమే కాఁబోలు!

కీర:—సారీ! అందుకనియే యీపరితాపము. ఈబద్ధ
మూర్తులు జడజగత్తులోఁ గలిసిపోవుదాఁక, పవి
త్రప్రేమమయప్రాణములు పవిత్రప్రేమలోఁ గలిసి
పోవుదాఁక, బహిరంతరజగత్తులలోఁ బ్రత్యణువు
నందును నిన్ను వెదకికొనుచు వెదకికొనుచు
యుగయుగాంతరము లిట్లే పరితపించుచు నన్నుఁ
దిరుగనిమ్ము!

శారి:—అంతే! అంతే! అంతేనా! అట్లయినచో నేనీ జగత్తులో లేను-లేను.

౨

శారి:—హరీ! నేన నిన్ను విడిచిపోయినను, నీ స్మృతిమాత్రము నన్ను విడుచుటలేదే-నేను లేనంత మాత్రమున నీవు నన్ను మఱచిపోఁగలవా?

కీర:—ప్రియా! మంచిప్రశ్నయే వేసితివి. వినుము, ఈ మానవప్రపంచము మఱపుతో నిర్మింపఁబడియున్నది. వెనుకఁ బడిపోయినది స్మృతిపథమున నిలువఁబోదు. ముందు రానున్నదియును స్మృతికి రాదు. తానున్నా నన్న స్మృతి మాత్రము తనకు స్పష్టముగా గోచరించు చుండును. మఱపుమానవుని జన్మింపు హక్కు. స్మృతి దైవసంబంధమైనది. దైవప్రభావమువలనఁ గలిగిన ప్రేమయొక్కటియే మర్త్యత్వసంబంధమైన మానవుని మఱపుతెరను ద్రోసివైచి, దివ్యస్మృతిరంగమున జీవించి చిరంజీవిగాఁ జేయుచున్నది. ఆ ప్రేమజీవుల యన్యోన్యానుబంధము వలననే జాగరిత మగుచున్నది. అట్టి దివ్యప్రేమకధిష్ఠాత్రివైన నిన్ను నేనెట్లు మఱవఁగలను? అట్టి పావనప్రేమను బ్రసాదించిన నిన్ను.—

శారి:—హృదయాధినాధ! ఎందుకీ గాథ! నన్ను మఱచి సుఖపడరాదా?

కీరి:—హృదయేశ్వరి! నా మఱపే నీస్మృతియగుచున్నప్పుడు నేను నిన్ను మఱచుటయెట్లు? మఱచుటయందే సుఖమున్న దన్న మాట మనో దౌర్బల్యము దే నన్న దే కాని-నిజముగా నీవే చెప్పుము!-తనంతనే కలుగవలసిన మఱవు ప్రయత్న సాధ్యమగునా? కాదు-సర్వమును మఱచుటకై యత్నించుట యనిన సుఖస్మృతికి సుస్థిరత్వముం గల్పించుట యన్న మాటే-ఔను-నీవు బోధించి నట్లు నేనందుకే ప్రయత్నించుచున్నాను. నీవన్నట్లు నాకందే సుఖానుభవ మగుచున్నది. అందు చేతనే-ఆ సుఖస్మృతి సకలమును మఱపించుట చేతనే-నేను నిన్ను నిత్యమును నాహృదయసింహాసనమున నిలుపుకొని-పూజించుకొని సుఖించుచున్నాను.

శారి:—నే ననవలసినది నీవు ముందుగనే చెప్పుకొనుచున్నావా? పూజించుకొనుచున్నది నేను-ఆరాధించుకొనుచున్నది నేను.

కీరి:—(ఆనందముతో) అది కాదనఁ జాలను. ప్రేమించుట తెలిసిని వారికే-పూజించుకొనుట, ఆరా

ధించుకొనుట, ధ్యానించుకొనుట, మొదలగునవి తెలియునని నే నొప్పుకొనుచున్నాను.

శౌరి:—ప్రాణాధికా! నేనే ప్రేమించుచున్నాను. నిజముగ నేనే నిన్నుఁ బ్రేమించుచున్నాను. ఎందుకు ప్రేమించుచున్నానో చెప్పలేను. అదికష్టమో, సుఖమో, కష్టసుఖములకు వెలియైనదో కూడఁ జెప్పలేను. కాని, నీవు నన్నుఁ బ్రేమించుచున్నావని తెలిసికొన్నప్పుడు మాత్రము అనిర్వచనీయమైన సుఖమే యనుభవమునకు వచ్చుచున్నది. నీమూలమునఁగాక ప్రేమించుటలో నింతటి సుఖమున్నదని నాకెట్లు తెలియును?

కీరి:—ఔను. ఇప్పుడు నీవు గ్రహింపఁగలిగినదియు, నే ననుభవింపఁగలిగినదియు నొక్కటే-స్నేహానుబంధరూపమైన యొత్తిడిచే హృదయము నందలి మఱుఁగుతెర జాఱిపోయినప్పుడు సుఖానందసురుచిరమైన ప్రేమమూర్తియే ప్రత్యక్షమగును.

శౌరి:—అట్లే యైనది. ఏమిచ్చిన నా దివ్యసుందరమూర్తి నాహృదయసింహాసన మందు శాశ్వతముగ నెలకొనియుండునో సెలవిచ్చి నన్ననుగ్రహింపుము.

కీరి:—నే ననుగ్రహించుటయు, నీవు గ్రహించుటయునా? ప్రేమార్ద్రహృదయములకుఁ బరస్పరావిజ్ఞేయము లేమున్నవి?

శారి:—హృదయేశ్వరా! లేవు. ఐనను నాకీ వరమిమ్ము. ఈ హస్తములతో ఆపాదపద్మసేవఁ జేయుదును. ఈ యానందబాష్పములతో అర్ఘ్య మొసంగుదును. ఈ చిన్నిహృదయముతో నా ప్రేమఫలము నర్పించుకొందును. ఇంకే మీయవలయునో చెప్పుము. ఇంకేమి మిఁగిలి యున్నదో సెలవిమ్ము!—

కిరి:—(ఆనందబాష్పములతో) హృదయేశ్వరీ! నీకీయరానిది లేదు. నాకుఁ గోరఁదగినదియు లేదు.

3

శారి:—నా వెఱ్ఱిహరీ! ముగ్ధురాఁడ వగునీకా కన్నీటి బిందువులు?-

కిరి:—ఆ ముత్యాలహారముతో నా బంగారుబొమ్మ నలంకరించుకొందమని—

శారి:—నా కన్నులలోని వెలుఁగా! జ్ఞానస్వరూపుఁడ వగు నీకా-శోకబహుళపక్షాంధకారము!—

కిరి:—నా మాణిక్యకిరీటము నా కటికచీఁకటిముసుఁగులో దస్యులకంటఁ బడకుండ దాఁచుకొందమని—

శారి:— నా మనోహరమూర్తి! గభీరహృదయుండవగు నీకా కరుణగీతములు?

కీరి:—నా ప్రణయవిశ్వాధిదేవతను ప్రస్తుతించుకొందమని—

శారి:—సముద్రగామినియై పోవుచున్న యీసరస్వతీ స్రవంతిలోఁ బడి నీవును గొట్టుకొనిపోవుట యెందుకు?

కీరి:—అనంతమగు. నా ప్రేమసముద్రములోఁ గలిసి పోవుదమని—

శారి:—కలిసిపోవుదువా? ఎవ్వరితోఁ గలిసిపోవుదువు? ఎంతటి స్వార్థపరుఁడవు! ఇఁక నామాట యేమి?

కీరి:—వెఱ్ఱిదానా ఎంతటి వెలవు! నా ప్రేమసుధాసాగరము నీలోనిదే కాదా?

శారి:—నిజమేనా? అది నాలోని దేనా? నాలో నే మున్నదో నేనింకను బరీక్షించుకొనే లేదు. నాకా పరీక్షయే యక్కఱలేదు. నాకు నీకంటె నన్యమే దియును దలఁపునకుఁ దట్టకుండవలయుననియే నాదీక్ష.

కీరి:—సఖి! సంకల్పసిద్ధురాలవగు నీవు నీయాత్మీయతను నాకుఁ బ్రసాదించుటచే నేను ధన్యుఁడనైతిని. ఇట్టి వరవర్ణినీవరప్రసాదముంగాంచి నేను నిన్నేమని వినుతింపవలయునో నాకట్టి పదములు స్ఫురించుటయే లేదు. అన్య చింతలేని యీనా

హృదయచలనశబ్దములలో నెట్టియర్థము గోచరించుచున్నదో నీవే గ్రహియింపవలయునని యీ మూఁగకన్నులు నిశ్చలకటాక్షములతో నిన్నుఁ బ్రార్థించుచున్నవి. ఇంతకంటెఁ బ్రేమహృదయములకుఁ బ్రతిఫలాపేక్ష యేమున్నది?

శారి:—(ఆనందబాష్పములతో) హృదయాధినాథా! నేను నిలువున నీరై పోవుచున్నాను. కరఁగి పోకుండ-కాలవాహినికి లోఁబడిపోకుండ-ఎన్ని జన్మములకైన నీపాదపద్మముల నాశ్రయించి యుండునట్లు నన్నాశీర్వదింపుము!

కీరి:—హృదయేశ్వరీ! కాలవాహినులు కదలిపోవుఁగాక! లోకములు ప్రళయవిలీనములై పోవుఁగాక! నా భావాంతరాళమోహనజ్యోతిస్వరూపిణివగు నీకును నాకును విపర్యము లేదు-విచ్ఛేదము లేదు- వినాశము లేదు.